# రాణాప్రతాపసింహ

ద్విజేంద్రలాల్ రాయని వంగనాటకమునకు తెనుగు

గ్రంథకర్త

శ్రీ పాద కామేశ్వరరావు



The Nellore Progressive Union

శ్రీ నెల్లూరు వర్ధమాన సమాజము

కీ॥ శే॥ ధరణికోట వరలక్ష్మమ్మగారి

జ్ఞాపకార్థము

శ్రీ ధరణికోట సుబ్రహ్మణ్యము

శ్రీ తూములూరు వెంకటశివరామయ్య

గార్లచే బహూకృతము

# ఉపోద్ఘాతము

కీర్తిశేషులగు ద్విజేంద్రలాల్ రాయుని వంగనాటకము లలో నిది చాలా పెద్దది-దీనిని ఆంధ్రరంగస్థలమున ప్రదర్శ నానుకూలముగా చేయుటకు మూలమెంతో కుదించవలసి వచ్చింది-అందుచే కొన్ని రంగములు పూర్తిగా తీసివేయబడి నవి, మరికొన్నిటిలో భాగములు విడువబడినవి ఇప్పుడు న్నలాగుననే దీని నీ యూర ప్రదర్శింప ప్రేక్షకులామోదిం చిరి కావున ఇట్లే ప్రచురింప సాహసించితిమి, అందుకు చదువరులు మమ్ము మన్నింతురుగాక!

వంగనాటకమును మా కధ్యాపన మొనర్చిన శ్రీమాన్ రాధాగోవిందదాసు బి ఏ, ఎల్ టి, మహాశయులకును, ఈ నాటకప్రదర్శమున మా కమితసాహాయ్య మొనర్చిన మా మిత్రులకును కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాము

రాజమంద్రి<br>జూన్ 1926

చెఱుకువాడ వేంకటరామయ్య

# ఈ నాటకమందలి ప్రధాన పాత్రములు

## పురుషులు

| | |
|---|---|
| రాణాప్రతాపసింహుడు | కథానాయకుడు |
| శక్తసింహుడు | ప్రతాపుని తమ్ముడు |
| అమరసింహుడు | " " కొడుకు |
| గోవిందసింహుడు | |
| మానా | " సర్దారులు |
| రోహిదాసు | |
| అక్బర్ | మొగలు చక్రవర్తి |
| సలీమ్ | అక్బర్ కొడుకు |
| మానసింహుడు | ముఖ్యసేనాని |
| మహాబత్ | మొగలు సేనాధ్యక్షుడు |
| చాందేరి | |
| మార్వార్ | |
| బికానేర్ | అక్బర్ పరిషద్గణము |
| అంబర్ | |
| పృథ్వీసింహుడు | |

## స్త్రీలు

| | |
|---|---|
| ఇర | ప్రతాపుని కూతురు |
| మెహెరున్నిస్సా | అక్బరు " |
| దౌలతున్నిస్సా | " మేనగోడలు |
| జోశీబాయి | పృథ్వీసింహుని భార్య |

షరా: గ్రంథాలయమువారి అనుమతి లేక ఈనాటక మాడరాదు






# మొదటి అంకము

## —మొదటి రంగము—

కోమలమీరు కాననాభ్యంతరము—కాళికాలయము

ప్రతాపుడు, రసపుత్ర వీరగణము, పురోహితుడు

ప్ర—జగన్మాతయగు కాళిసమ్ముఖమున ప్రమాణము చేయుదము

అంద—అట్లే చేయుదము

ప్రతా—మాతృభూమియగు మేవారుకు ప్రాణములను ధారవోయుదము

అంద—(అట్లే అందురు)

ప్రతా—చిత్తూరు పునరుద్ధారణ మగువఱకు భూర్జపత్రములలో భుజింతుము

అంద—(అట్లే అందురు)

ప్రతా—అంతవరకూ తృణములపై శయనింతుము

అంద—(అట్లేఅందురు)

ప్రతా—వేషభూషణములు పరిత్యజింతుము

అంద—(అట్లే అందురు)

ప్రతా—మేము గాని మా పుత్రపౌత్రపరంపరకు చెందినవారు ఎవరట గాని మొగలులతో వివాహసంబంధములు చేసుకొనము

అంద—(అట్లే అందురు)

ప్రతా—ప్రాణాంతము వచ్చినా ఆత్మగౌరవమునకు హానికరమగు దాస్యము చేయము

అంద—(అట్లే అందురు)

పురో—స్వస్తి! స్వస్తి! (తీర్థము చల్లును)

ప్రతా—రసపుత్రశూరులారా! ఏకలింగనాథ సమక్షమున కత్తిముట్టి శపథము చేసినారు, దీనిని భంగము చేయజనదు

గోవిందసింహుడు—ప్రభూ! ప్రాణములుపోయినా అట్లు జరగదు

ప్రతా—ఇట్టి ఘోరశపథ మేల చేసితిమో ఎరుగుదురా? దేశహితేషణ బాల్యక్రీడ కాదు, అది ప్రకృష్టసాధన, వట్టిమాటలతో గాని పాటలతో గాని సాధ్యమగునది కాదు, కవిత చెప్పినంతనే దేశోద్ధారణ కాజాలదు, అష్టకష్టములు పడవలయును, ప్రాణములొడ్డి పట్టుదలతో పనిచేయవలయును, హృదయమును చీల్చి రక్తము చిందవలయును మంచిది, అచిరకాలమున కోమమిూను చేరుటకు ఆయిత్తులు

కందు, పొండు. (వారు పోయినవెన్క ప్రతాపుడు పచారు చేయును )

పురో—మహారాణా! నేటి శపథము నిర్వహింప గలవా?

ప్రతా—గురూత్తమా! లేనిచో ప్రమాణ మేల చేయుదును—మాతృభూమి నుద్ధరించు భాగ్యము అందరికీ అబ్బదు, కాని దాని యోగక్షేమములకై ప్రాణములు వీడుట అందరికీ చేతిలోనిపని కదా?

పురో—ఈప్సితార్థసిద్ధిరస్తు—(పోవును )

ప్రతా—బ్రాహ్మణాశీర్వాద మమోఘ మగుగాక! అక్బర్! అన్యాయరణమున రహస్యముగా జయమలుని వధించి, మా చిత్తూరు నాక్రమించితివి మేము రసపుత్రులము, అధర్మయుద్ధము చేసే వారము కాము-శత్రులమైనచో న్యాయయుద్ధమున చిత్తూరు చేజిక్కించుకొందుము—నీవు విజాతీయుడవు, దూరదేశమునుండి వచ్చితివి-భారతీయులనుండి ధర్మయుద్ధమనగా నెట్టిదో, ఏకాగ్రత, సహిష్ణుత, సహజ వీర్యము, దేశసేవ, స్వార్థత్యాగము లెట్టివో నేర్చుకో— నేడు నీవు భారతవర్షమునకు సార్వభౌముడవు, కావున సింహాసనస్థుడవై అతినీచులు, స్వదేశస్వధర్మద్రోహులునగు రసపుత్రుల సనేకుల నాచుచున్నావు. వారు నిన్ను బట్టులవలె పొగడుచుందురు అందు కొందఱు సమరభూముల వెన్నిచ్చి పాఱిన పిఱికిపందలు, మఱికొందఱు తమకన్యలను, భార్యలను

తో బుట్టువులను అధికారలుబ్ధులైమీాచరణముల కర్పణచేయు వారు కావునమీాఅనుగ్రహమునకుపాత్రులైఉన్నతపదవులజెంది యున్నారు మా కులమందింకొక తెగ రసపుత్రులున్నారని నిదర్శనము చూపెదను, వారు మాతృభూమిని పూజించుచు నారీగౌరవము నిలువబెట్టుటకు, స్వదేశస్వధర్మరక్షణ మొన ర్చుటకును ప్రాణములనైన 'పోగొట్టుకొన నుద్యుక్తులై, భవ త్కృపాదత్త పురస్కారమును తలదన్నువారు-నా జనకుడగు ఉదయసింహమహారాణా నీబారికి వెరచి చిత్తూరు విడిచి పారిపోవుట గంటివి-వారిపుత్రుడనగు నేను నీబలముల పార దోలి చిత్తూరు కైవసము చేసుకొందునని ప్రతిన చేసితిని, దాని నెట్లు నిర్వహింతునో కనుచుండుము (మోకరించి) జగజ్జననీ, మహాకాళీ, నేను నిర్వర్తితప్రతిజ్ఞుడ నగునట్లును, ధర్మము జయించునట్లును, మహత్త్వము మాకు సిద్ధించు నట్లును, మాప్రేయసి చిత్తూరు—పరపదదళితయగుచిత్తూరు- మా వశమగునట్లును వరము ప్రసాదింపు మమ్మా? (శక్తిసిం హుడు వచ్చును )

ప్రతా—తమ్ముడా, ఇంతవరకు ఎక్కడ నుంటివి?

శక్త—ఎంతవరకు?

ప్రతా—మేము కాళి నర్చించునపుడు నీ వేమిచేయు చుంటివి?

శక్త—ఆలోచించుచుంటిని-

ప్రతా—ఏమాలోచించుచుంటివి?

శక్త—భవిష్యదంధకారమున పరుగులెత్తుచుంటిని జీవితసమస్యల చిక్కుదీయుచుంటిని.

ప్రతా—కాళిని పూజించితివా?

శక్త—పూజా? లేదు పూజయందు నాకు నమ్మకము లేదు, పూజవలన పుష్టిలేదు కాళికాదేవి నాలుక వెడలబెట్టినది, అబల, మూగది; కదలలేదు, మట్టిబొమ్మ, ప్రాణమూ, లేదు, త్రాణా లేదు-ఆమెను పూజించిన నేమిఫలము? అంతకన్న ఆలోచనయే శ్రేయము, కావున అట్లు చేయుచుంటిని, సమస్యల చర్చించుచుంటిని

ప్రతా—ఏ సమస్యలు?

శక్త—జన్మాంతరవాదము సత్యమా? సత్యమని నేను నమ్మను, కాని అది నిజము కావచ్చును ఆకాశమున ధూమకేతువువలె మనుజుడు పృథ్వియందు కన్పించి హఠాత్తుగా మాయమగును, మరి కనబడడు, ఇంకొకచోట నావిర్భవించునేమో? కొన్ని పదార్థముల సమష్టిచే నాత డావిర్భవించి అవి విచ్ఛిన్నమగునపుడు మృతినొందును, ఇట్లు విచ్ఛిన్నములైన ఖండములు తలా ఒక జీవి కావచ్చును లేదా—

ప్రతా—శక్తా! ఇట్టి నిగూఢప్రశ్నల కల్పించుకొని వాటిగూర్చి రాద్ధాంతసిద్ధాంతములచేయుటయేపని అని యెంచి జన్మమంతయు జరుపుచుందువా? అట్టి ప్రశ్నల కంతములేదు. నివృత్తియూ నిశ్శేషముకాదు ఇట్టి నిష్ఫలచింతల నికమాని రమ్ము, యుక్తకర్మ నాచరింతము సహజసరళమగుబుద్ధి కేది

తోచునో, అంతకరణప్రవృత్తి కేది అనుకూలించునో, అట్టి పని చేయవలెను కాని వ్యర్థకాలయాపనమెందుకు?

శక్త—యుక్తకర్మ? అదేది?

ప్రతా—తమ్ముడా! దీర్ఘకాలము మన జన్మభూమిని గనుము పరపాదదళితమై, హృతాలంకారయు, ప్రపీడితయు నగు మాతృభూమిని వీక్షించియును సోదరుల మిద్దఱమూ ఆమె నద్ధరించుటకు ప్రాణోత్సర్గము కావించుట కంతకన్న మహత్తరకర్మయూ, శ్రేష్ఠతరకార్యమూ ఉన్నదా? ఇదే ఉచితమగుపని

(భామాసా వచ్చును)

మంత్రీ! విశేషములేమి?

భామా—అశ్వము సిద్ధముగా నున్నది

ప్రతా—శక్తా! రమ్ము, రాజధానిక, కర్తవ్యము లనేకము లున్నవి, కోమలమీరు పోదాము

శక్త—ఇదే వచ్చుచున్నాను (ప్రతాప భామాసాలు పోవుదురు) జన్మభూమియా? నేను దాని కెవడను? అది నాకెవతె? నేనిట పుట్టినంతమాత్రమున దీనిమెడ నాకు కర్తవ్యమేముండును? ఇటపుట్టనిచో నన్యదేశమున బుట్టియుందును లేదా, సముద్రమందో, ఆకాశమందో పుట్టియుందును జన్మభూమి! ఇదేకదా నన్ను నిర్వాసితుని చేసినది? మూడడుగుల నీడయు, నాల్గుగింజల కూడు నీయులేకపోయినది! దానికై నా ప్రాణ మర్పించుట యేమి ప్రభావము? ఏమి ప్రతాపము?

ప్రతాపా, మేవారు రాణావు కావుగ, నీవు ప్రాణమర్పింతు వేమో? నేనట్లేల చేయవలయును? అనావశ్యకము అది నాకే మవుచు? ఏమూ కాదు దానికొరకు నేను చావనేల?

(పోవును)

—రెండవ రంగము—

(ఉదయసాగర తీరమున అమరసింహుడు)

అమర—రామరామ! ఇన్నిదినములనుండియు విశ్రాంతియే లేదు అహోరాత్రములు యుద్ధోద్యోగమే కదా? తండ్రిగారి కాహారము లేదు, నిద్ర లేదు, ఎప్పుడూ భటశిక్ష, వ్యాయామము మంత్రాంగము మొదలగు వాటితోడనే కాలక్షేపమగుచున్నది నేను మహారాజు పుత్రుడనను మాటే కాని సామాన్య సైనికులతో సమముగా రణవ్యవసాయము చేయవలెను కదా రాణాకు పుత్రుడనౌటవల్ల లాభమేమి? మాకందరికీ స్వేచ్ఛ అని పేరేకాని కోరి తెచ్చుకొన్న అసీమ దారిద్ర్యము, సంతతదైన్యము, దుగపనేయ సర్వాభావమును మమ్మావహించుచున్నవి ఏమి దేశాభిమానమో! అంతా అగమ్యగోచరము అదే కక్కాగారు వచ్చుచున్నారు

(శక్తసింహుని ప్రవేశము)

కక్కా! ఇట్లు వచ్చినారేల?

శక్త—ఇంట ఉమ్మగా నున్నది, ఇచ్చట గాలివేయు

చున్నది ఉదయసాగరతీర మతిమనోహారము కావున నిట
పచారుచేయవస్తిని

అమ—మీరున్నచోట నిట్టి ప్రాదము లేదా?

శక్త—లేదు

అమ—కోమలమీరు మీకు రుచించినదా!

శక్త—ఆఁ కొంత మేలు

అమ—మా తండ్రిగారు మి మ్మిక్కడికి పిలువనంపుట
మొగలులతో యుద్ధము చేయుటకేనా?

శక్త—కాదు వారు నా కాశ్రయము నిచ్చిరి

అమ—అటులనా? ఇతఃపూర్వము మీరు నిరా
శ్రియులా?

శక్త—కొంతమట్టుకు నిరాశ్రయుడనే

అమ—తండ్రిగారును మీరును సోదరులో?

శక్త—ఔను

అమ—అట్లైన రాజ్యము తండ్రిగారి కెట్లులభించెనో,
అట్లే మీకు కూడ లభించవలయునే?

శక్త—కాదు, ఆత డగ్రజుడు, నే నవరజుడను

అమ—అయిననేమి? భ్రాతలేకదా?

శక్త—శాస్త్రానుసారము జ్యేష్ఠునకు రాజ్యము సంక్ర
మించును, కాని కనిష్ఠునకు రాదు

అమ—అదేమి నియమము? జ్యేష్ఠుడయినంతమాత్ర
మున అతడు శ్రేష్ఠు డగునా? కాకున్న అట్టి నియమమేల?

శక్త—నాకు తెలియదు (స్వ) ఇదొక మంచి ప్రశ్నయే జ్యేష్ఠుడగునంతమాత్రమున శ్రేష్ఠుడు కాజాలడు, శ్రేష్ఠునకు రాజ్యమిచ్చుట యుక్తము, అతడు జ్యేష్ఠుడైనను సరే, కనిష్ఠుడైనను సరే, అట్లుగాక కేవల జ్యేష్ఠునకే రాజ్యమిచ్చుట న్యాయమని తోచదు ఇది గొప్పసమస్యయే.

అమ—కక్కా! ఏ మాలోచించుచున్నారు?

శక్త—ఏమియూ లేదు చీకటి పడుచున్నది, పోదాము పద

## —మూడవ రంగము—

(చిత్తూరివరి లోయలో ప్రతాపుడు)

ప్రతా—అక్బర్! మేవారమును జయించినవాడవు నీవు, కాని దాని పాలించువాడను నేను విశాలమగు నీప్రదేశము గృహశూన్యము చేయదలచి యిందలి గ్రామవాసుల నందఱిని గిరిదుర్గములలోనికి జేర్చితిని నేను బ్రతికియుండ నిచటినుండి ఒక చిల్లిగవ్వనైన నీ ధనభాండారమును చేరనీయను ఈదేశమున దీపముపెట్టుటకు దిక్కు లేకుండుచే రాజ్యమంతయు ధూంధూంయమానమగుచు, ఈప్రాంతమున శ్మశానమందువలె నిస్తబ్ధత నిలిచియున్నది రేల గుడ్లగూబలు పాటాడుచున్నవి సస్యక్షేత్రములందు రెల్లుదుబ్బులు మొలిచినవి కాలిబాటలన్నియు ముండ్లపొదలచే నిండి కాన

డవివలె అగమ్యములయినవి ప్రశాంతజనావాసములు భీకరారణ్యమృగావాసము లయ్యెను జననీ, జన్మభూమీ! సుందరమేవారరాజ్యరమా, వీరమాతా! ఈనాటికి నీ కీవేషమబ్బెనా? తల్లీ! నిన్నెప్పుడు నావశము చేయజాలుదునో నాడు నాచేతులతో నిన్నలంకరించెద అంతవరకూ నిన్ను శ్మశానసంచారిణియగు పరివ్రాజికావేషమున నుంచెద నీవు మొగలులకు దాసివగుటచూడ నాగుండెలు బద్దలగుచున్నవి, కడుపుడుకుచున్నది—అమ్మా! అమ్మా! నీకెట్టి దుర్దశ ప్రాప్తించెను!

(గోపాలు నొకని తోడ్కొని భామాసా వచ్చును)

భామా—రాణావారికి జయమగుగాక!

ప్రతా—భామాసా! ఏమి వార్తలు? ఈత డెవడు?

భామా—మహాప్రభూ! వీడు చిత్తూరుదుర్గము దఱినొకలోయలో మేకలను మేపుచున్నాడు

ప్రతా—ఓయీ! నిజమా?

గోపా—నిజమే

ప్రతా—మేవారున నెచటనైన సేద్యముచేసినను, గోమేషాదుల మేపినను మృత్యుదండన మొసంగుదుమను మాయాజ్ఞ నెరుగవా?

గోపా—ఎరుగుదును

ప్రతా—అయినా మేకల నేలమేపితివి?

గోపా—మొగలదుర్గాధిపతి ముదలచే నటు చేసితిని

ప్రతా—నీకు ప్రాణదండన మొసంగినాను, నీకెవరు దిక్కు ?

గోపా—ఈవార్త ఆతనిచెవిని బడెనా ఆతడు నన్ను తప్పక కాచును

ప్రతా—అట్లే కానిమ్ము ఈవార్త నిప్పుడే ఆతనికి సంపెద భామాసా, వీని గొంపోయి చెరలోనుంచి నేటికి వారమునాడు వధించి, తల నొకవెదురునకు గ్రుచ్చి, చిత్తూరు దుర్గమునకు పోవు మార్గమున పాతించుము. అది చూచిన వారిక మొగలులు చిత్తూరును జయించినను ప్రతాపుడే దానిని పాలించుననియు, అతని యాజ్ఞ మీరుట ఆట కాదనియూ విదితమగును (పోవుదురు) అమాయికుడా ! గోపాలా ! ఉద్ధతుండు మధ్య బేద వైతివి రావణుని పాపముచే లంక పాడయ్యెను, దుర్యోధనుని మూర్ఖతచే మహాత్ములగు భీష్మ, ద్రోణ, కర్ణు లసమసిరి, నీవన నెంత ? ఇది నిష్ఠుర కర్మ, కాని జననీ ! మేవాడు రాజ్యలక్ష్మీ ! నీకొఱకు నేను నిష్ఠురుడను కావలసి వచ్చినది అందుచేతనే నిన్న భూషణ హీనను చేసి, ప్రియతమయగు పట్టపురాణికి పాతగుడ్డ కట్ట బెట్టి, కుటీరములయందు నివసించి, ప్రాణాధికులగు శిశువు లచే కఠోరదారిద్ర్యవ్రత మాచరింపజేసి, నేను సర్వభోగముల వీడి సన్యాసినైతిని తమ్ముడా,

(శక్తసింహుడు వచ్చును)

కనబడెనా ?

శక్త—కంటిని

ప్రతా—దేనిని?

శక్త—నిర్జనమగు నిచ్చోటును

ప్రతా—ఎవరూ కంట బడలేదా?

శక్త—లేదు

ప్రతా—ఏల?

శక్త—అదేమో? చెప్పేవా రేరీ?

ప్రతా—పురోహితు డేడీ? అతడేకదా మొగలసేనా గమనవార్త మనకు దెల్పెను

శక్త—ఇంటివద్ద లేడు

ప్రతా—అయితే మనరాక నిష్ఫలమే

శక్త—నిష్ఫలము కానేల? ఇచ్చట అనేక వన్యమృగములు ఉన్నవి పులుల వేటాడుదము

ప్రతా—మనకు పులివేటా?

శక్త—ఇప్పుడు చేయునదేమి? ప్రభాతము మనోహరముగా నున్నది, స్థలమూ నిస్తబ్ధారణ్యము, మార్గములు నిర్జనములై భయావహములుగ నున్నవి ఇక మిగిలియున్నది రక్తస్రావమే, మనుజుల రక్తము లభింపమి మనుజాదు లరక్తపాతమొనర్తము

ప్రతా—నిర్హేతుక రక్తపాతమేల?

శక్త—హేతువు లేకేమి? అలుగులజిమ్ము నభ్యాస మొనర్తము మీ గురి మంచిదో నా గురి మంచిదో పరీక్షింతము

ప్రతా—లక్ష్యపరీక్ష చేయవలెనని యున్నదా?

శక్త—అవును (న్వు) నా కాశ్రయమిచ్చునంత సామర్థ్యము నీకున్నదో లేదో? లేనిచో మేవాడునకు రాణావగుటకు నీవెట్లు తగియుండువు? నేను నీయాడచుండి నీయన్నము తిని నీకులొంగి యుండనేల?

ప్రతా—సరే, నమువుము నిదర్శనము మాత్రము—వేటయు నాటయూ కలిపినచ్చును (పోయి తిరిగ వచ్చి) దీని నేను చంపితిని, అదే మాను నాకోల!

శక్త—దీని నేను చంపితిని, ఇదే చూడు నాకోల!

ప్రతా—సరే పంగని వేటాడుదము పద (పోయి వత్తురు)

శక్త—దెబ్బలుతిని పంది పారిపోయినది

ప్రతా—ఎటూ స్థిరపడదాయె, నేను వేళ మీరుతినది—ఇంకొకసారి పరీక్షింతము

శక్త—ఇకొకసారి యేల? నేడే తేలవలయు

ప్రతా—ఎట్లు?

శక్త—మన మొకరికొకరు గురిమాత్రము

ప్రతా—బాగు! శక్తా, బాగు!

శక్త—ఇందు నష్టమేమి?

ప్రతా—ఇందు లాభమేమి?

శక్త—లాభము లేకపోవచ్చును, దాన చెడుగేమి? కొంచెము రక్తము చిమ్మునేమో? కంచుక మున్నది, మరణ

భయము లేదుకదా!

ప్రతా—ప్రాణభయము నాకెన్నడును లేదు

శక్త—అట్లయిన విల్లెక్కిడుము నరరక్తస్రావమును కోరి యిట వచ్చితిమి, నాల్గు రక్తబిందువులనైన గాల్తము, విల్లెత్తి అమ్ము విడువుము

ప్రతా—నీవు చిన్నవాడవు, ముందు నీవు వదలుము

శక్త—ఇద్దర మొకసారియే వీడుదము (సిద్ధులు కాగా) పురోహితుడు వచ్చుచు

పురో—ఏమిది? అన్నదమ్ములు సూడు ఆలముకకు బూనితిరా? వీరవరులారా! శాంతము పూనుడు

శక్త—బ్రాహ్మణోత్తమా! దూరమున నుండుము, లేకున్న నీచావు తప్పదు నరరక్తపాతము కావలె, నలుగుల వదలవలె

పురో—మృత్యువునకు జంకువాడ గాను నరరక్తము నాసించుచుంటిరా? ఇదే కొనుడు, నే నిచ్చెద (పొడుచుకొనును)

ప్రతా—ఆఁ! ఆఁ! బ్రాహ్మణోత్తమా! ఎంతపని జేసితివి?

పురో—దీని కేమి? ప్రతాప! శక్తా! మిమ్ము శాంతి పరచుట కిట్లొనర్చితిని అన్నదమ్ము లిట్లు కలహింపజెల్లునా? దీనినుండియే దేశ మింతదీనదశకు వచ్చినది, కావున శక్తా! సోదరకలహమును పెంచకుము (మృతి)

ప్రతా—శక్తా! ఎంతపని జేసితివి!

శక్త—ఇట్లగునని నే నెంచనైతిని

ప్రతా—నీవుండియే ఈబ్రహ్మహత్య సంభవించినది నీజ తకము చూచినవారెల్ల నీవు స్వదేశమునకు సర్వనాశ హేతుభూతుడ వగుదువని చెప్పిరి నాకు నమ్మకము లేకుండె, కాని నే డది ప్రత్యక్షమయ్యెను

శక్త—ఈబ్రహ్మహత్య నావలన కలుగుట నిజమే

ప్రతా—నీవు నిరాశ్రయుడ వని నిన్నాదరించి యిట జేర్చితిని జన్మభూమి నుద్ధరింపనమకట్టిన నేను తద్వినాశ హేతుభూతుడవగు నిన్ను నాయొద్ద నుంచజాలను, కావున ఇప్పుడే నారాజ్యము వీడి పొమ్ము

శక్త—మంచిది నాకు సెలవిమ్ము (నమస్కరించును)

ప్రతా—పొమ్ము నే నీబ్రాహ్మణుని కగ్నిసంస్కారాదులచేయించి పాపపరిహారార్థము ప్రాయశ్చిత్త మొనర్చుకొనెద (పోవును)

---

*　　*　　*　　*

## — ఆరవ రంగము —

దర్బారు—అక్బరు శక్తసింహులు

అక్బ—మీరు రాణాప్రతాపసింహుని సోదరులా?

శక్త—చిత్తము

అక్బ—ఏ యుద్దేశముతో నిట వచ్చినారు ?

శక్త—మొగలసైన్యముతో రాణా నెదిరించుకోరిక-తో వచ్చితిని, రాణాను మీపాదాక్రాంతుని చేయవలెనని నాముచ్చట ఆతని సైన్యరక్తమున మేవారభూమిని సక్తము చేయవలెనని నా కోరిక

అక్బ—దాన మాకు లాభమేమి? మేవారము నుండి నేటివరకొకచిల్లిగవ్వయైన మాభాండారమును చేరలేదే?

శక్త—రాణాను జయించినచో పుష్కలముగు రాబడి వచ్చును ఆతని యాజ్ఞాబలముచే మేవారము నేడు సేద్యము కాలేదు, లేకున్న అది బంగారుపండదా? ఒకనాడు మీ సేనాధిపతియాజ్ఞచే నొకడు మేవారభూమియందు మేకల మేపినాడని రాణా వానిచంపించెను మీరిది వినేయుందురు

అక్బ—మీకు మా కెట్టిసాయము చేయగలరు?

శక్త—నేను రసపుత్రుడను, యుద్ధకుశలుడ, రాణాతో పోరెదను, రణమున గెల్చెద- సైన్య మిండు

అక్బ—దాన మీ కేమిలాభము?

శక్త—ప్రతిశోధ! నా అప్పు తీరును

అక్బ—అంతేనా?

శక్త—అంతే

అక్బ—మీకు నేననిచ్చిన రాణాను జయించగలరా?

శక్త—జయించగలననియే నా నమ్మకము ప్రతాపుని సైన్యబల మెరుగుదును, యుద్ధకౌశల మెరుగుదును, అభి

సంధి తెలుసుక, సైన్యచాలనాప్రణాళి తెలియుక ప్రతాపుడు వీరుం, నేను పిరికి, అతడు క్షత్రియుడు, నేను క్షత్రియుడ, అతడు రసపుత్రుడు, నేను రసపుత్రుడ అతడు జ్యేష్ఠుడు, నేను కనిష్ఠుడ ఒకనాడు ప్రసంగవశమున, "జ్యేష్ఠుడైనంతమాత్రమున అతడు శ్రేష్ఠుడు కాజాలడ"ని ఆతని పుత్రుడమరసింహుడు నాతోననెను. ఆమాట నాహృదయమున నాటియున్నది, నిజ మిప్పుడు తేలవలయును

(దౌవారికుడు వచ్చును)

అక్బ—దౌవారికా! మానసింహమహారాజుగారేమి చేయుచున్నారు?

దౌవా—మహాప్రభూ! చూచి వచ్చెదను (పోవును)

అక్బ—మీరు మహారాణా వారికి కృతజ్ఞులని వింటిని

శక్త—ఎట్లు?

అక్బ—ఆతడు మీకుపకారము చేయనేలేదా?

శక్త—చేయకేమి? మా తండ్రిగారు నన్ను చంపుట కాజ్ఞ నీయగా—

అక్బ—ఏమీ! మీతండ్రిగారు మిమ్ము చంప నాజ్ఞాపించిరా? ఎందుకు?

శక్త—నా జనితేతిహాసము నాకర్ణింపుడు, సార్వభౌమా! నేనైదువత్సరముల వాడనై యున్నప్పుడు కత్తి నొకదానిని జూచి దాని మొన పరీక్షించుటకై నాచేయి కోసుకొంటిని-నేను జన్మభూమి కభిశాపమూర్తుడనియు, తన్నాశ

హేతువు ననియూ నాజాతకమున నున్నదట. అందుచే నిస్సం
శోచముగా ఏనాడు సేయి కోసుకొంటినో ఆనాడు నాజాత
కము తప్పక సఫలము కాగలదనియు, దుస్సాధ్యముల నైనా
సాధింపగలవాడననియు భీతిల్లి నా తండ్రి నామరణము నకు
సమ్మతించెను

అక్బ—చిత్రముగా నున్నది!

శక్త—సార్వభౌమా! ఇం దాశ్చర్యమేమి? పరప్రత్యే
యనేయబుద్ధులు అట్లే చేయుదురు. భీరుడగు ఉదయసింహ
రాణాను ప్రభువు గా నెఱుగరా? చిత్తూరమట్టడినా డాతడు
కాపురుషునివలె శాలిబలము చూపకున్న ఆపట్టణసౌభాగ్య
సూర్యు డస్తమించునా?

అక్బ—ఏమీ? యువకుడా! చిత్తూరు రాజపుత్రుల
పరిపాలనమునుండి మొగలుల పాలనములోనికి వచ్చుటచేత
దాని సౌభాగ్యము పోయినదా? ఇప్పుడు సౌభాగ్యము లేదేమి?

శక్త—సార్వభౌమా? ఎట్లుండును?

అక్బ—మీ రాటవికులు అనాగరకులు కావున రాజ్య
శాసన మెఱుగరని మీ రొప్పుకొనరా?

శక్త—రాజపుత్రులు అనాగరకులో తురకలనాగరకులో
నే నెఱుగను, కాని యేజాతివారునూ మేము బర్బరులమని
ఒప్పుకొనుట నే వినలేదు.

అక్బ—అనాగరికులు గాకుండిన రాజపుత్రులు మొగ
లుల కేల లొంగిరి?

ఇట్లాతడు నన్ననుగ్రహించిన అగిరి కాలమున కాతనికి పుత్రో దయ మాయెను. ఇంతలో ప్రతాపసింహుడు మేవారమునకు రాణాఅయ్యెను. అతడు గోవిందసింహుని నిర్బంధమున నన్ను నిజరాజధానికి రప్పించి తత్ప్రాసాదమున సాదరముగ సాకు చుండెను. అంతట—

అక్బ—మీకు మేవారమునకు సర్వనాశహేతుభూతు లని మీ అన్న యెఱుగునా?

శక్త—ఎఱుగకేమి? ఈవార్త దేశమంతటా మ్రోగు చుండెను.

అక్బ—అట్లైన మీయన్నగారు మీకు మహోప కారము కావింపలేదా?

శక్త—ఉపకారమా? అన్యాయముగా స్వీయజన్మ భూమికి, స్వీయరాజ్యమునకు, స్వీయస్వత్వమునకును వంచితుడనైన నన్ను తనరాజ్యమునకు రప్పించుట ప్రతాపు నకు విధి. ఉపకార మెట్లగును? అందుకై నేను కృతజ్ఞుడ గానేల? నారాజ్యము నాకు లభింపనేలేదు—అతడు మేవార మునకు రాణాయగుటకునూ నేనతనియాజ్ఞావహుడనగు భృత్యుడ నగుటకునూ హేతువేమి? మేమిద్దరము సోదరు లముకామా? అతడు జ్యేష్ఠుడగుట సత్యము, నేను కనిష్ఠుడ జ్యేష్ఠుడైనంతమాత్రమున నతడు శ్రేష్ఠుడగునా? సార్వభౌమా! మాలో నెవరు శ్రేష్ఠులో పరీక్షసేయ నొకనాడు కడంగితిమి, తత్క్షణమే బ్రహ్మహత్య ప్రాప్తించుటచే నిజము నిశ్చితము

కాలేదు అది నిర్ణీతమై ఆతడు నన్ను నిర్వాసితుని చేసియుం డెనా నా కేక్షోభయు లేకపోవుట తత్పూర్వ మాతడు నన్ను పోరోుటు కేవల మన్యాయము దానికే నేను ప్రతిక్రియ చేయజూచుచుంటి

అక్బ—ప్రతాపునకు మీయం దయిష్టమా?

శక్త—లేదు, మే మిష్టులమే

అక్బ—అతనికి మీయందు నమ్మక మున్నదా?

శక్త—లేదేమి?

అక్బ—అట్లైన నేదైనా ఛలముచే అతనిని మావశము చేయక మొదటనే పోరజూచెద రేల?

శక్త—ఆ పని మాచేతగాదు సార్వభౌమా! సెలవు (లేచును)

అక్బ—కూర్చుండుడు అందువలన నావరమేమి? జగడము మాని చాతురిని కార్యము సాధింపగల్గునెడ వృథా రక్తపాత మొనర్పనేల?

శక్తి—సామ్రాట్, మీరు సుసభ్యులగు మునలి మానులు కావున అట్టి నయవినయములు, వంచనయు మీకు చెల్లును మేమో, బర్బర రాజపుత్రులము — బంధుత్వ మాపాదించెనా, హృదయపూర్వకముగా ఆలింగన మొనర్తు ము, శత్రుత్వ మలనడెనా, కత్తితో కుత్తుకను త్తరింతుము, గుప్తఘాతి కావ్యవహారము మాచేత గాదు బయట బంధు త్వము, లోన శత్రుత్వము మే మెఱుంగము, రాజపుత్రుడు

బంధువైన, గా రాజపుత్రుడే, ప్రతిహింసయ దనూ రాజ
పుత్రుడై ధర్మమున నాకు విశ్వాసము సున్న, నిరీశ్వరవాది
ని, సామ్రాజ్యద్రోహిని, సంఘనియమములకు ప్రతికూలు
డను నిజమే కాని రాజపుత్రుడను, తదనుచితకార్య
మొనర్పను

అశ్వ—మానసింహుడు క్షత్రియులలో పెక్కుగు
యుద్ధసిద్ధుడైనను కార్యములనెల్ల కౌశలముగాన సాధింపలే
డను పలుసారులు రాజపుత్రులపై దాడివెడలి, బలము
చూపి బెదరించి పరదోరసే గాని యుద్ధము చేయలేడు

శక్త—అత డట్లు చేయుటేమి? లేనిచో మీసేనాధి
పతి కాఁగలడా? మీబోంట్లకది రుచింపదు

అశ్వ—అతడుమాత్రము రాజపుత్రుడు కాఁడా?

శక్త—అతని తల్లి గర్భము రాజపుత్రుల నింటని

అశ్వ—మీ యభిప్రాయమేమి?

శక్త—చెట్టునుబట్టి పండు మాదిరిగనట్లు వంశమును బట్టి
పలుదెఱఁగుల రసపుత్రులు వెలువడిరి ఇట్టియ సతడు ప్రభు
వువారి శ్యాలకపుత్రుడు-కావున మీతోడ రాజాధిరాజ
భోగముల ననుభవించుచున్నాడు, నా కట్టిబంధుత్వము లేక
మానసింహునకు ప్రభువారిపోలుడు గా, నా కట్టిభాగ్య
మబ్బలేదు

అశ్వ—సరే మీరు విశ్రామాగారమున కేఁగుడు
యథోచితాజ్ఞను నే పొసంగెదను

శక్త— (పోవును)

అక్బ—ప్రతాపసింహా! నీ తమ్ముడు నాచేతిలో చిక్కి-
నాడు, ఇక నీపన నెంత? సాధ్యమగు నిట్టిసుయోగము నాకు
లభించుచున్న, విపులమగు నీ సామ్రాజ్యవర్తమును నేను జయిం
పగల్గుచెట్టిలు? మానసి హమహారాజు నాకు సహాయకారి
కాఁ యున్న మొగలసామ్రాజ్య మింతవఱకు పెరుగుచెట్లు
(మానసింహుఁడు వచ్చును)

మహారాజా! అభివాదము

మాన—సార్వభౌమశేఖరా! జయోఽస్తు! ప్రభువు
వారు నన్ను దలంచుటకు హేతు వదుగవచ్చునా?

అక్బ—ప్రతాపసింహుని తమ్ముని శక్తసింహుని
గంటిరా?

మాన—ఇప్పుడే త్రోవలో జూచితిని ఎదురుపడిన
వాఁడై పేకలక్ష్యముగ నాతఁడు మాచెను

అక్బ—అతఁడు నిర్భీకుఁడు, కులాభిమాని, విశ్వాసు
డు, వ్యాఘ్రప్రసిద్ధుఁడు- స్వార్థరహ్యముగక్కు- వేశోకచింత
ఆతనికిలేదు సారవంతమగు వ్యక్తిన్యే, కాని సానబట్టి
వలయును

మాన—ప్రతిహింసాపరుఁడు—

అక్బ—ప్రతిహింస కాదు, ప్రతిశోధ- పేరిమయు,
ప్రతిహింసయు నాతనిహృదయము న చేరనేరవు ఒరులు తన
కీడువలచినది విశ్వేషముగా గొనుటయు, ఒరులకు తాని

యవలసినది నిశ్శేషముగా నిచ్చుటయు నాతనిధర్మములు, ఇతరముల నాతడు మన్నించువాడు కాదు వంశాభిమాన ముత్కటము, భాతృప్రేమ సరేసరి

మాన—ప్రభువు వా రాజ్ఞాపించున దేమి?

అక్బ—ప్రతాపసింహుడు మేకలమేపిన తురకవాని నొకని చంపించెనని మీరు విన్నారా?

మాన—నేను వినలేదు

అక్బ—మనసేనల మున్నూరు నాశనముచేసి మూడు పట్టణములను మట్టిలో కలిపెనని వింటిరా?

మాన—వింటిని

అక్బ—ఈక్రూరవ్యాఘ్రము నెంతకాల మిట్లు స్వేచ్ఛగా సంచరింపనిచ్చుట? ఆతనిపై దాడిచేయుట కింతకన్న నెక్కుడు సుయోగము లభించునా? మీ అభిప్రాయ మేమి?

మాన—నేను శోలాపురమునుండి మగిడివచ్చునపుడు త్రోవలో ప్రతాపుని సందర్శించెద, సామాన్యుపాయములచే గాని కౌశలముచే గాని ఆతని వశపరచుకొనజాలితినో, రక్త పాతము లేకనే కార్యసాధన మగును, అది సర్వోత్తమము కానిచో యుద్ధము సిద్ధము

అక్బ—సర్వకార్యముల నహాఃరీతిని నిర్వహించు భారము మహారాజావారి భుజస్కంధమున మోపితిమి

మాన—ప్రభువువారి కటాక్షము (అక్బరు పోవును) నే నీప్రస్తావమునకు సిద్ధపడే వచ్చితిని రేవా వివాహమును

గూర్చి తండ్రిగారు శిక్ష నచిరి ప్రతాపసింహుని అగ్రసుతు డగు అమరసింహున కామె నీయవలెనని నాకున్నది ప్రస్తా వము చేసిచూచెద-ప్రతాపు డొప్పుకొననని యే శోచెదిని అది ఉత్తమోత్తమము కళంకితమగు మా అంబరువంశ మును నిష్కళంకమగు మేవారరక్తముచే పరిశుద్ధి చేయవల యునని ఎన్నినాళ్ళనుండియో యోచించుచుంటని మేము పతితులము-దుష్పథానువర్తియగు విపులరసపుత్రకులమందు ప్రతాపా, నీశుభ్రనిష్కళంక పతాక మొక్కటియే పరిథవిల్లు చున్నది ధన్యోసి ధన్యోసి!—(పోవును)

---

—• ఏడవ రంగము •—

---

[మొగలప్రాసాదోద్యానమున మెహెరున్నిసా దౌలతున్నిసాలు]

దౌల—చూడు, చూడు, మెహెర్, పావురముల గుంపెల్లెగురుచున్నదో—చూడవేమే?

మెహె—ఆ! పావురము లెగురుటలో చూచుట కేమున్నదే?

దౌల—అది ఆశ్చర్యజనకము కాదా? పృథ్విలో నింత కన్న వింతలేవే?

మెహె—వింతలకు కొదవా, పృథ్వినెల్ల నిండియున్న వాటిని వెతుకనేల?

దాల—ఏదీ—కొన్నింటిని చెప్పుము, విందును

మెహె—అట్లైన వినుము—మొదట—ఈ పృథ్వియే వింతయైనవస్తువు—పనిలేదు, పాటులేదు, అవసరము లేదు, సూర్యునిచుట్టూ ఎప్పుడూ తిరుగుచుండును ఎందుకో ఎవరూ ఎరుగరు పిమ్మట—మనుష్యుడొక ఆశ్చర్యజనకమగు జంతువు, మాంసపిండరూపమున జన్మించి సంసారతరంగముల యందనుక్షణము పడుచు లేచుచు నుండియుండి యొకనాడు మాయమగును ఎటుపోవునో ఎవ్వరూ ఎరుగరు కృపణుడు ధనమును కూడబెట్టునే కాని అనుభవింపజాలడు—ఇది వింతి కాదా? ధనవంతుడు తనసొత్తంతయు వ్యయముచేసి తుదకింటింట బిచ్చమెత్తుకొనును ఇదొకవింత పురుషగణము-బుద్ధిమంతులమని అమితగర్వమున మెలంగుచు పెళ్ళిచేసుకొని తమంతటతామే వలలో చిక్కుకొందురు కూటికీ గుడ్డకూ వెలియై కాలుసేతులు కదల్పలేక గోతిలోనుండి బయటికి రాలేరు ఇది యొకవింత

దాల—అయితే, స్త్రీలు వివాహమాడుదురుకదా, ఆమూర్ఖతకూడా వింతకాదా?

మెహె—ఆడవాళ్ళలో కొందరికి పెళ్ళి అవశ్యాచారము పెద్దవారయినప్పుడు పొట్టకూ బట్టకూ ఉండజూచుకొనవలెను కదా? నేనూ-అక్బరు సార్వభౌముని కూతురిని ఇంకొకని చెట్టబట్టి, అతనికాళ్ళపై బడిన నది యొకవింత-ఏ

మందువా? తినుటకున్నది, కట్టుటకున్నది-కావున పెండ్లి యాడుట పెద్దతప్పు, మతిమాంద్యము

దౌల—నీవు పెళ్ళిచేసుకోనని నిశ్చయించుకొని హాయిగా కూర్చున్నావా?

మెహె—పెండ్లియాడనని నిశ్చయించుకొంటిని గాని కూర్చోలేదు

దౌల—అదేమే?

మెహె—యుక్తవయసువచ్చిన కాంతను-చేయుటకా పనిలేదు—కాయక్లేశ మక్కఱలేదు-అట్టి నే నెట్లుండవల యునో అట్లుందును కుట్టెదను, కూనరాగముతీసెదను, పండు కొందును, మేలుకొనియెద-ఆవులించెద-ఒడలు విరిచెద చిటి కవేసెద-పెండ్లికానిపడుచునగుట కుట్టుచూ ఓమర్ ఖాయ్యా మ్ చదువుచుందును-చిత్తచకోరమును చిత్రశాలలదూలము లపై వ్రాలునట్లు చేయుచూ, అలసత నావలతోసి ప్రపంచ మందలి జంతువిడంబనముల చూచుచు, పురుషగణమున నామనమునకు నచ్చినవారిని వెదకుచుందును

దౌ—వెదకివెదకి ఎవనినైనా ఎంచుకొంటివా? లేక ఊరక వెదకి విసిగి, వేసారి, వెక్కసపడితివా? నీమదికి నచ్చిన వాడెవడే?

మెహె—అది నీవడుగుట న్యాయమా? నేను నిశ్చ యించితినే అనుకొమ్ము-అది నీకు చెప్పతగునా?

దాల—కూడ కేమి? నేను నీ కాప్తురాలను కానా? అంతరంగబంధువును కానా?

మెహె—నీబంధుత్వము నాశరీరమును జొచ్చి శల్యగతమైనది, కాని ఈవిషయ మంతకంటె లోనిది-ఈ స్థూలశరీరాంతర్గతమై సూక్ష్మశరీర మున్నచో దానికి చెందదగినది, బయట పడనీయకూడదు సరే, నీ వింత విపరీతముగా నిర్బంధించుచున్నావు గాన నాచిత్తచోరుని యాకారమును స్థాళీపులాకన్యాయమున-దిఙ్మాత్రసూచకముగా నెఱిగింతును, వినుము

దాల—మంచిది, సావధానురాలనై యున్నాను నీచిత్తచోరుని పోల్చుకొనగలుగుదునేమో చూచెదను-

మెహె—నా మానసహరుని అందము వినుము, చందము గనుము

ముక్కు—ఉన్నది- చెవులు- అంతజాగ్రత్తతో పరిశీలింపలేదు, కాని ఉండియుండును అతడు నవ్వినముత్యాలూ రత్నాలూ రాలునో రాలవో యెరుగను, కాని పల్వరుస కాన్పించును రోదనము చేసెనా, వాని ముఖసౌందర్యము హెచ్చదు, పాడుచున్నాడను భ్రమ పుట్టదు—నా ప్రాణకాంతుని పట మింతవరకు నెరింగించితిని కదా? శేషించినది నీవే ఊహించుకొనుము, లేదా ఇంకొక తూరి చెప్పెదను

దాల—అబ్బో! నీ చిత్తచోరుడు నా కన్నులకు కట్టినట్లున్నాడే!

మెహె—ఇదిగో, చూచిచూచి వాని వఱచెదవు సుమా! అందువలన విశేషనష్ట ముండదు, మా తండ్రిగారికి నూర్గురకంటె నెక్కుడు భార్యలున్నారు కాని, నీవు వాని వలవకున్న కార్యసరణి అనుకూలించుచు

(సలీము వచ్చును)

సలీ—మెహెర్! ఇక్కడేమి చేయుచున్నారు?

మెహె—ప్రపంచమునందలి వింతల దౌలతు వర్ణింపు మన్నది, కావున కొన్నిటిని వివరించితిని

సలీ—ఏదీ, చెప్పుము, నేనుకూడ వినెదను

మెహె—దౌలత్, ఏదీ చెప్పు, నీకు ముఖస్థముగా నున్నవి కాబోలు- చలకలాగు పల్కవే- ఏమి చెప్పితినో నేను మఱచితిని- సలీమ్, నాకు కల్పనాశక్తియే కాని స్మృతిశక్తి లేదు-దౌలతు కొత్తదారుల తొక్కనేరదు, కాని దాని స్మృతి శక్తి దృఢమైనది- నేను దొరికినదానినెల్ల వ్యయముచేయు దును, దౌలతు దాని ఖర్చుచేయక ఆయము సేయును ఆ! జ్ఞప్తికి వచ్చినది- కృపణుడు యావజ్జీవము కూడబెట్టిన దానిని వానికొడుకో మనమడో త్వరలో కాజేయును- ఇది యొక వింత.

దౌల—ఇదొక వింతయా? సలీమ్, నీవు చెప్పుము

మెహె—ఇది వింతకాదా? సలీమ్, నీవు చెప్పు

సలీ—దీనికేమి? ఇంతకన్న నెక్కుడు వింత యొకటి కానున్నది

మెహే—బాల—ఏది? ఏది?

సలీ—అక్బరు సార్వభౌమునితో రాణాప్రతాపసం హుని యుద్ధము. ఈ పుడమిని సర్వోత్కృష్టుడు అమితశక్తి వంతుడు నగు సార్వభౌమునితో నొక క్షుద్రక్షత్రియునకు సంగ్రామమట! ఇంతకన్న వింతకలదా?

బాల—వాని మతి పోయినట్లున్నది

సలీ—నేను నట్లే మొదట అనుకొంటిని, కాని కొద్ది కాలముక్రిందట సార్వభౌముని మూడుసేనలు ముక్కలు చేయుట చూడ ఆతడు వెర్రివాడనజెల్లదు చూర్గురు రిపుత్తురు లేచూర్గురు ముగ్గురు సైనికుల పేచ మడచిరి

మెహే—మీరు ఘోరయుద్ధమున వారిని పరాజితుల జేయరాదా?

సలీ—ఈ నాడే అదే జరుగును మానసింహుడు శోలాపురమునుండి మగిడివచ్చునప్పుడు ప్రతాపుని దర్శించి ఆతని సైన్యబలము యుద్ధప్రక్రియయు పరిశీలించి వచ్చును ఆత డెవ్విధినైన ప్రతాపుని వశపఱచుకొనెనా సరే, లేకున్న యుద్ధము తప్పదు

మెహే—యుద్ధమునకు నీ వేగుదువా?

సలీ—నేను వెళ్లకున్ననెట్లు? ఆడదానివలె గాజులు తొడిగించుకొని నగళులలో గాడుకొనమందువా? లేక గుడ్డివానివలె కుడిచి కూర్చుండుమందువా?

మెహె—నీవు పోవుచో నీ వెంట నేనుకూడ వచ్చెదను.

సలీ—నీవా?

మెహె—ఏమి? వింతగా నున్నదా?

దౌల—మెహెరుతో నేనుకూడా వత్తును

సలీ—బాగుబాగు! మీరు యుద్ధక్షేత్రమునకు వచ్చి ఏమి చేయుదురు?

మెహె—యుద్ధ మెట్టిదో చూచెదము తెలుచుగా మావద్దచేరి "ఇట్లు యుద్ధమొనర్చితిమి, అట్లు శతృవుల జంపితిమి" అని మీరు బడాయి గొట్టుచుందురు. కావున మీరు నిజముగా యుద్ధమెట్లుచేయుదురో మేము స్వయముగా చూడవలయును

సలీ—మేము యుద్ధము చేయకున్న జయాపజయంబు లెట్లు నిర్ణయింపనగును?

మెహె—నేను చెప్పనా? ఈవైపు కొన్నిఫిరంగులు ఆవైపు కొన్నిఫిరంగులూ ముందు పేల్చెదరు ఆవెన్క నొక నాణెము తీసి ఒకప్రక్క పడిన నొకపక్షమువారూ ఇంకొక ప్రక్క పడిన ఇంకొకరును జయించినట్లనుకొని ఒక ముసలి వీరు డానాణెమును గట్టిగా గోటితో నెగురజిమ్మిన పిమ్మట నాణెము న కేప్రక్క తిరుగబడిన నాపక్షమువారు జయించిరని నిశ్చయించి భేరీలు మ్రోగింతురు అంతేనా?

సలీ—వాహ్వా! అట్లైన సేనలేల?

మెహె—వార్తలను తీసుకొనిపోవుటకు—మనుష్యులను పిల్చుటకూ చూపులకు భీతిగొల్పుటకూ, సేనలుండవలదా? సలీమ్—నీవు విలాసపురుషుడవు—నీకు యుద్ధము చేతనగునా? ఏమే దౌలత్, ఏమందువు?

దౌల—నిజమే

మెహె—పాలుత్రాగుబిడ్డవంటి సుకుమారివి, నీకు యుద్ధప్రశంస యేల? బాలకా!

సలీ—సరే—మీరే చూచెదరుకదా! నే నెట్లు యుద్ధముచేయుదునో వేరే చెప్పనేల?

మెహె—అట్లే కానిమ్ము

సలీ—తండ్రిగారి అనుమతి వడసి మిమ్ము తప్పక నావెంట గొనిపోయెదను, అంతా మీరు చూడవచ్చును. (వెళ్ళును)

మెహ—(నవ్వి) సలీముకు వురియెక్కించి తమాషా చూడవలయు, ఇట్టి ఫుట్టిభోగి పట్టుమని ఒకదెబ్బకు స్మృతి తప్పి పడిపోడా?

దౌల—సార్వభౌముడు వచ్చువేళ అయినది, నేను పోయెదను

మెహె—ఇదే మంచిసమయము ఆతని యనుమతి వడయుటకు—ఇచటనే యుండుము

దౌల—బాబో! నే నుండజాలను

మెహె—ఎంత పిరికిదానవే? సార్వభౌముడు

పులియా, భూతమా? అతని చూచి మనము పారిపోనేల?

దాల—నే నుండజాలను (పోవును)

మెహ—తండ్రిగారన్న దాంతు భయపడుగ, నాకు భీతిలేదు లోకమంతటకీ సార్వభౌముడు కాని నాకు తండ్రి కాడా? ఇంటిలో నాతని ఆధిక్యము సాగునా?

(అక్బరు వచ్చును)

అక్బ—అమ్మా! మెహెర్, ఒంటరిగా నున్నావేమి?

మెహ—దాల తిరిగవచ్చూ ఇక్కడనుండి మీరు వచ్చుచున్నారని యిప్పుడే పరుగెత్తినది

అక్బ—ఏమి?

మెహ—అదేమో? మీశత్రువులు మిమ్ముచూచి జడియవలయును గాని మా కేమి భయము?

అక్బ—నీకు నేనన్న భయము లేదా?

మెహ—రవ్వంతయూ లేదు- మాకంటికి మీరు మనుష్యులవలెనే కన్పడుదురు, ఢిల్లీసుల్తానలైన నేమి తురుష్క సార్వభౌములైననేమి? మిమ్ము చూడ మాకు భీతి జనింపదు, గౌరవము జనించును

అక్బ—ఏమి?

మెహ—ఒకవంక వృద్ధులు, ఇంకొకవంక జనకులు

అక్బ—నిజమమ్మా! నన్నుచూడ సంతానమునకే సంతానమైన నన్నిక ప్రేమించువారెవరు? సలీ మిప్పుడిటు వచ్చెనా?

మెహె—వచ్చెన—అక్బరు మీకు రాణాప్రతాప సింహునితో రణమా?

అక్బ—కావచ్చు. మానసింహుడు రాణాను చూడబోయెను, ఆతడు వచ్చినపిమ్మట నది నిశ్చితమగును

మెహె—నలీ గూయుద్ధమున కేగునా?

అక్బ—పోక తీరదు—అతనికి యుద్ధముచేయు నభ్యాస మలవడవద్దా? మానసింహు ం చిరజీవిమా?

మెహె—తండ్రీ! నా దొక మనవి

అక్బ—చెప్పుము

మెహె—నెరవేర్చెదవా? ముందు చెప్పుము

అక్బ—అదేమి? నేను నీమిద్దు చెల్లింపనా, మెహెర్!

మెహె—నేనూ దాలతూ ఆయుద్ధమును జూడబోవు దుము

అక్బ—సరిసరి స్త్రీలు యుద్ధభూమికి పోవుదురా? వా రచ్చట చేయునదేమి?

మెహె—స్త్రీలు చూడ బోకూడదా? స్త్రీలు మను ష్యులు కారా? ఎల్లకాలమూ అంత పురకారాబద్ధులై యుం డవలయునా? వారికి మాత్రము ముచ్చట లుండకూడదా?

అక్బ—ఇదేమి ముచ్చట? ఇది సంభవమా?

మెహె—సంభవము కాకేమి? సత్యమే తండ్రులకు కుతూహల ముండవచ్చును కాని, తనయుల కుండకూడదా?

అక్బ—నే నెప్పుడైన కుతూహలుడ నైతినా?

మెహె — కాకేమి? చిత్తూరున జయించి మిగిడిన నాఁ "స్వామిద్రోహులగు వీరు ప్రచ్ఛన్నులై శత్రువధ సల్పుట నివు వింటివా" అని నన్ను మీరడిగి నేను హిందువుల పురాణములనుండి వాలివధయు ద్రోణునిమరణముఁ జెప్పగా మీరు నివ్వెరపడలేదా?

అక్బ — అదియు నిదియు నొకటే?

మెహె — ఏమైనాసరే తండ్రీ! నాకు యుద్ధము చూడవలెనను కోరికగలదు, నెరవేర్చవా?

అక్బ — యుద్ధమగునప్పుడు గదా?

మెహె — అయిననేకదా చూడబోవుట

అక్బ — అప్పుడాలోచింపవచ్చును లే (పోవుదురు)

---

## — ఎనిమిదవ రంగము —

(ఉదయసాగరతీరమున రాజపుత్రసర్దారులు, మానసింహుడు)

మాన — నా యభ్యర్థనమున మీరు కావించిన యీ ఆయోజనమునకు ప్రతాపసింహమహారాణావారికి చిరకృతజ్ఞుడను

భామాసా — మా ప్రస్తుతావస్థయందు మహారాజు గారికి యోగ్యములగు ఏర్పాటులు జరుగుటెట్లు? దాని నెఱింగియే ప్రభువువారు మా యసామాన్యాభ్యర్థనము ప్రస్తు

తించుట మా భాగ్యము—లోపముల నెన్నింతురుగాక

మాన—ప్రతాపసింహమహారాణావారి ఆతిధ్యగ్రహణము ప్రతిరాజపుత్రునకు సమ్మానహేతువు

గో॥ సిం॥—మానసింహామహారాజా ! సత్యము

మానా—మహారాజుగారు మాటలయందు మహారాణావారియెడమక్కువజూపుచూ, మంత్రణమున మనకులమునకు పరమ శత్రువగు పాదుషాపక్షము వహింతురు, సకల విషయముల సార్వభౌమునకు దాసులు

గో॥సిం—మానా! ఊరకుండుము ఈత డక్బరుని శ్యాలకపుత్రుడు కాడా? అట్టివాని కన్య మెద్దికర్తవ్యము?

భామా—ఆతడెట్టివాడైనను మన కతిథి ప్రభూ! మానామాటల పాటింపకుము

మాన—ఆత డన్నది సత్యమే అందు ప్రమాదమేమి? అక్బరునకు శ్యాలకపుత్రుడ నగుటకు నే నుత్తరదాతను కాను, ఆకార్యము నావలన కలుగలేదు ఆతని పక్షమున నాల మొనర్చుట స్వయంకృతము, ఆతనిపై కత్తినెత్తుట రాజద్రోహము కాదా?

గో॥సిం—మహారాజా! రాజద్రోహ మెట్లగును?

మాన—ఆతడు భారతవర్షమున కేకచ్ఛత్రాధిపతి కాడా?

మానా—ఏ యధికారమున?

మాన—శక్త్యధికారమున భారతసార్వభౌముడెవడో

యుద్ధములందు పలుమారు స్థిరపడుట లేదా?

మానా—యుద్ధమంత యైనదా? స్వాధీనతానిర్వాహణమునకొనర్చు సంగర మొకవత్సరమున గాని, ఒక శతాబ్దమున గాని అంత మొందునది కాదు అది వంశపరంపరాగతము

మాన—కాని అది కేవలము నిష్ఫలము ప్రభూత బలుడూ, అపరిమిత సాధనసంపన్నుడూ అగు సార్వభౌమునికి ప్రతిఘటించి కలహించి వృధారక్తపాత మొనర్చుట వల్ల ఫలమేమి?

మానా—మానసింహా! ఫలాఫలములు దైవాధీనములు, మనసహజవివేచనానుసారము కార్యనిర్వహణ మొనర్ప వలయును కాని, ఫలాఫలముల బాధ్యత మనకేల?

మాన—ముందువెనుక లారయక మొగియుట మూర్ఖత గాదా?

గో॥సిం—మహారాజా! ఇదియే మూఢత యైనచో ప్రపంచమందలి ఉచ్చప్రవృత్తులూ మహత్వమూ కూడా ఈ మూఢతయందే నిహితములగుచున్నవి ఇట్టి మూఢ్యముచేతనే సాధ్వియగుస్త్రీ ప్రాణములు విడుచునుగాని సతీత్వము విడువదు ఇట్టిమూర్ఖతచేతనే, స్నేహమయియగు మాత సంతానమును సంరక్షించుటకు జ్వాలావహ్నిలో దుముకును ఇట్టి మూర్ఖత మూలముననే, ధర్మపథానువర్తులగు భారతీయులు కత్తుకల నుత్తరింతురు కాని కోరాను చేపట్టరు మానసింహా! ప్రతాప

చితిమి, దానిని వీరరక్తాభిషేచనమున నార్పవలయు యుద్ధమున జయమే రానిండు పరాజయమే రానిండు, అది దైవాధీనము మొగలుల ఎదుట నక్షీణముల నంచువారము కామనియూ మేవారుకోసము ప్రాణములనైన వీడుదుమని యూ ప్రతిన నొనర్చితిమి, దాని మరవవద్దు యుద్ధసన్నద్ధులు గండు జే! మేవారలక్ష్మికి జే!

అందఱు—రాణాప్రతాపసింహునకు జే! జే!! జే!!!






# రెండవ అంకము

---

## —• రెండవ రంగము •—

(సలీము శిబిరమున మెహెర్ దౌలతులు)

మెహె.—ఏడీ? సలీము లేడే? సరే- వాని రాకకై వేచియుండము

దౌల.—మెహెర్, నేడు నీకు కోపము వచ్చినట్లున్నది.

మెహె.—కోపము రాదా? యుద్ధము చూచుటకే కదా ఆగ్రాప్రాసాదము వీడి వచ్చితిమి యుద్ధము యుద్ధమన్నమాటయే కాని యుద్ధమేదీ? తూర్యధ్వని భేరీరవమూ అప్పుడప్పుడు వినబడుచున్నవి, ఉలుకూ లేదు, పలుకూ లేదు ఇట్లు నిశ్చింతోదాసీనత నుండుట నాచేత గాదు, ఇట నొక నిమిషమైన నుండనొల్లను, నేడే యింటికి పోదము.

దౌల.—నీ యభిప్రాయ మెరుగలేకున్నాను యుద్ధము చూడవచ్చునపు డెంతో గందరగోళమయ్యె. ఇక్కడకు వచ్చునరికి "ఇదగో నేడు యుద్ధము, రేపు యుద్ధమ"ని గడుపు

చున్నారు నిహోపికపట్టజాలక పదేపదే పారిపోవుచు నను చున్నావు, విపరీతముగా నున్నదే నీ హృత్ప్రవృత్తి!

మెహ—యుద్ధ మెక్కడే? నేటికి పదిహేను దిన ములు గతించెను, సైన్యములు ముఖాముఖియై యున్నవి, ఇరుతెగలవారును కన్నెఱ్ఱనేయుచున్నారే, కాని ఒక సారియైన తలపడిరా? వారి కంత ధైర్య మెక్కడిది? వట్టి కోలాహలమే! ఊఁహూఁ నే నిక సహింపజాలను, ఇప్పుడే పయన మయ్యెదను అదే సలీమ—

(సలీము వచ్చును)

సలీ—మీరు నాశిబిరమున కేల వచ్చితిరి?

దౌల—మెహెరుకు చాలాకోపము వచ్చినది

సలీ—ఎందుచేత?

దౌల—"నేడే పయన మయ్యెద న"నుచున్నది

సలీ—బాగుబాగు- యుద్ధము చూడకే?

మెహ—ఏదీ? యుద్ధమే లేదే ఒకదెస రసపుత్రులు ఇంకొకదెస మొగలులు-తోలుబొమ్మలవలె నిలిచియున్నారు, అప్పుడప్పుడు ధాంధాం అనిపించుచుందురు- యుద్ధము చేయరు, భేరీమృదంగముల వాయించరు, పిరికిపందలు! ఇదే యుద్ధమైనచో నికి చూడనక్కరలేదు- మేకలకంటె మెత్తని వారివలె గన్పట్టుచున్నారు

సలీ—అట్లుకాదు యుద్ధమగుచు భీరుడు కుత్సితుడు నగు మానసింహుడు సేనాధిపతి కొటచే యుద్ధ మిట్లు నీకు

గారుచున్నది- ఆతనికి రసపుత్త్రులెదుర్కొనుటయన్న
అడలు——నేనే సేనాధిపతినైనచో——

మెహె——నీవు సేనాధిపతివి కావా? కట్టుబొమ్మవా?
ఇందుకా యిటు వచ్చితివి? ఇచటి వ్యవహారములు చూడ నా
కొళ్ళు మండుచున్నది, నన్ను పంపివేయుము, నే నిట నుండను

సలీ——ఎట్లు పంపుదును? నిన్నిప్పు డాగ్రాకు పంపుట
సుకరమా?

మెహె——సుకరమే కానీ, దుష్కరమే కానీ, నన్ను
రేపు ప్రొద్దుట ఆగ్రాకు పంపకతీరదు- లేకున్న అంతా మట్టి
లో కలిపెదను

సలీ——ఏమి చేయుదువు?

మెహె—— మానసింగువద్దకు పోయి "యుద్ధము
చేయుదురా? లేక నన్నాత్మహత్య చేసుకొమ్మందురా?"
అని అడిగెద, రెండును నాకొకటే, ఇక నొక్కదిన మిక్కడ
నేనుండను

సలీ——యుద్ధము చూపుమని పిచ్చిదానివలె పట్టుబట్టి
చేసిన గోలయేమి? ఇప్పు డింటికి బోవుదునని నిర్బధించుట
యేమి? స్త్రీజాతిస్వభావమిది- నిన్ననేల? కాళ్ళు పట్టుకొను
టయే కొరత పెట్టితివి!

మెహె——ఆ కొఱత నిప్పుడు తీర్చెద (సలీముకాళ్ళను
పట్టుకొని) నాకు విసుగు పుట్టుచున్నది- వీరాంగనాంబలని (భ్రమ
పడి మీవెంట వచ్చితిని, కాని వాస్తవముగా మీరందరూ

భీమలు, మేకకుండునంత ధైర్యమూ తెగువయూ మీకు లేవు- పదములంటి పల్కుచున్నాను రేపు మనకో జయము మొదిరికో నిశ్చితము కావలయు- ముసుగులోని యీగుర్తిద్దు లాట మాన్పివేయుము, లేదా నన్నింటికి బంపుము- యుద్ధ మన్న నా కనహ్యమగుచున్నది

సలీ—మంచిది లెమ్ము నే నిదే మానసింహునితో మాటాడి కార్యక్రమము నిరూపింతును స్త్రీలు ధన్యలు, అందు నీవు పరమధన్యవు- పాదుషా ముద్దులబిడ్డవు- నా ప్రియసోద రివి-నీముద్దు చెల్లింపమా?

మెహె—ఏమి చేయుమందువు?- ఇచ్చటి పరిస్థితుల జూడ నెవరి కోడలు మండదు? (సలీము పోవును)

దౌల—మంచిమెత్తు వేసితివే

[శక్తసింహుడు "సలీమ్" అని పిలుచుచు లోనికి వచ్చి "ఓహో! ప్రమాదము! మన్నింపుడ"ని తోడనే పోవును ]

దౌల—మెహెర్, ఇత డెవడు?

మెహె—రాణాప్రతాపసింహుని తమ్ముడు శక్తసిం హుడు-ఎంత అందకాడే! హాయిహాయి! ఏమందువు?

దౌల—ఔను ఇతడూ కాదు అతడూ

మెహె— గొప్ప విద్వాంసుడని వ్యంగ్యప్రియుడని కూడా సలీము చెప్పుచుండును ఆహా! ఇటువచ్చి నిమిషమైన నిలువడాయె- ఆగిన మాటాడించియుందును ఇది యుద్ధ క్షేత్రము కావున దృష్టిదోషమును పాటింప నక్కరలేదు-

మన యాచారములలో నీ"ఘోషా" యన్న నా కొళ్ళు మంట మరల పదిమంది చూచిన మనయాపరాశి తగ్గునా? గౌరవము తరిగిపోవునా? మన శిబిరమునకు పోయి ఏ మాలోచించుచుంటివి? అతడు తిరుగ రాడు-అడేనా నీవు కోరునది? (పోవుదురు)

---

## —మూడవ రంగము—

[మానసింహుని శిబిరమున సలీము మహాబత్ ఖానులు]

సలీ—మహాబత్, ప్రతాపుని సైన్య మెంత?

మహా—దాదాపు పిరువయివే లుండునని చారులు చెప్పుచున్నారు, పిమ్మట భిల్లులసైన్య మున్నది

సలీ—ఇరువైరెండు వేలే నా? అంత మెల్లన్ననూ ప్రతాపుని పట్టుదల మాత్రము ప్రశంసనీయము, భారతసార్వ భౌముని పృథుసేన కెదురుగా నిట్టి స్వల్పసైన్యముతో నిలు చుట అనన్యసామాన్యము! ఆతని నొకసారి చూడవలెనని యున్నది

మహా—సమరక్షేత్రమున నాతని చూడక తీరదు యుద్ధరంగమున నాతడు సేనాముఖమున నుండునుగాని మొగల్ప్రభువులవలె వెదుకబడువాడు కాడు

సలీ—యుద్ధమందలి ఫలాఫలములను నీ సమరకౌశల

మున నిక్షిప్తము జేసితిమి, ఆ పినతండ్రికి తగినవాడ ననిపించు కొనవలయును సుమా!

మహా—యుద్ధమున నెగ్గుట నిశ్చిత మయినట్లే మన సేన శత్రుసేనకు నాల్గురెట్లున్నది, అందుపై మనకు ఫిరంగు లున్నవి, ప్రతాపున కవి లేవు ఇంతేకాక మానసింహమహారాజు దళవాయియై స్వయముగా మన సేనల నడుపును

సలీ—ఈ మానసింహుని పొగడ్త విన్న నాకు తలనొప్పి యుద్ధప్రసంగము వచ్చినప్పుడెల్ల తండ్రిగా రీతని నామమే జపించుచుందురు మానసింహుడు పాదుషా వారి కిష్టదైవము, ఈతడు లేకున్న మొగలసామ్రాజ్యము సుస్థాపితము కాదు కాబోలు!

మహా—ఇందబద్ధ మేమున్నది? కాకసస్ పర్వతపంక్తి మొదలు ఆరకాను వఱకు, వింధ్యహిమవత్పర్వతముల మధ్యనున్న ప్రదేశములలో మానసింహుని బాహుబలము లేకున్న నేదేశము మీకు కైవసమయి యుండును? ఇది పాదుషాకి తెలుసును, ప్రతాపసింహమహారాణా పరాక్రమము కూడా వారెరుగుదురు, కావుననే యీ యుద్ధమున నాతనికి సైన్యాధిపత్య మొసంగిరి.

సలీ—చాల్చాలు! మహాబత్, మానసింహుని పేరు వినివిని చెవులు చెముడుపట్టినవి ఆతడట్టిదుర్జయవీరుడైనచో నిజమకుటము నేల కాపాడ కొనలేకపోయె? స్వాధీనతాగర్వమున ప్రతాపునివలె శిరము నెత్తుకొనక మొగలసార్వభౌ

ముని పదరజమును తలపై నేల దాల్చును?

మహా—ధాతవ్రాత! యువరాజా! విధివిలసితము!

(మానసింహునకు పటమును పట్టుకొని ప్రవేశించును)

మాన—యువరాజా! వందనము, మహాబత్, సలాము—మేవారుసైన్యము కోమలమీరు పశ్చిమదిశను గిరిశ్రేణిచే సురక్షితము, అటబోవు దారి అతిసంకీర్ణము—రెండువైపుల నుచ్చమగు పర్వతశ్రేణి, ఆమధ్య రసపుత్రసేన యున్నది, ఆవెనుక భిల్లధనుర్ధరు లున్నారు, ఇదిగో పటము!

మహా—అట్లైన కోమలమీరు చేరుట దుస్సాధ్యమే?

మాన—దుస్సాధ్యమే కాదు, అసాధ్యము రసపుత్రసేన నిప్పు డెదుర్కొనుట యుక్తిసంగతము కాదు, వారు మనపై బడువఱకు మన మేమియు చేయక వేచియుండవలయును, లేకున్న ప్రమాదము తప్పదు

సలీ—మహారాజా! నిరుద్యోగులమై యిచ్చట నెన్నినాళ్ళు ఉండుట?

మాన—ఉండవలసి నన్నాళ్ళు యథాయోగ్యముగా అన్ని యేర్పాటులను కావించితిని

సలీ—వలదు మన మిప్పుడే వారిపై దాడియాడుదము

మాన—యువరాజా! అట్లుకాదు—వారు పయికొనుదాకా మన మాగుట శ్రేయము మహాబత్, నీవు పోయి నాయాజ్ఞ ననువర్తింపుము

సలీ—అట్లు జరుగకూడదు. మహాబత్, రేపుదయమున శత్రువులపై బడుటకు సిద్ధముగా నుండుడని నాసేనల కాజ్ఞాపించుము

మాన—యువరాజా, సర్వసేనాధిపతిని నేను.

సలీ—నే నీయుద్ధమున సాక్షిగోపాలుడనై వేడుక జూచ నంపబడితినా?

మాన—నిన్ను సార్వభౌముని ప్రతినిధిగా తెచ్చితిని.

సలీ—అనగా అర్థ మేమి?

మాన—అర్థమా? నీవు సార్వభౌముని నామస్వరూపుడవు, ఆజ్ఞాస్వరూపుడవు, చిహ్నతుల్యుడవు, నిన్ను గాక సార్వభౌముని పాదుకలు తెచ్చినను యథేచ్ఛము కార్యక్రమము జరుగలను

సలీ—అబ్బా! ఇంత గర్వమా? మానసింహా! (కత్తి దూయును)

మాన—యువరాజా! కత్తి నొరలో నుంచుము, లేకున్న తుప్పుపట్టును వృథాక్రోధప్రకటనమున ఫలమేమి? ద్వంద్వయుద్ధమున నీవు నాకు సముడవు కావని యెఱుగవా? సైన్యమంతయు నాచేతిలో నున్నది, నీవశమున లేదు

సలీ—నీవు నాయాధీనమున లేవా?

మాన—నేను నీతండ్రిగారి అధీన మండలివాడను, నీయధీనమున లేను. వారి యాజ్ఞానుసారము సర్వస్వాతంత్ర్యము వడసి యుద్ధభూమికి వచ్చితిని నీకృత్యములయెడ సాధ్యమగు

నంతవరకు చేయిచేసుకొనను నన్ను ధిక్కరించి నీవల్లరిచేసి
తివా పిచ్చివానివలె సంకెళ్ళు వేయించి అందుకు సమాధాన
మీయవలసినచో సార్వభౌము నెదుట నిచ్చెద మహాబత్,
నీవుపోయి నాయాజ్ఞను సేనలకు దెల్పుము (పోవుదురు)

సలీ—మంచిది యుద్ధము ముగియనిమ్ము, అందుకు
తగినశాస్తి కావించెదను భృత్యున కింత తలబిరుసా?
(పోవును)

---

—నాల్గవ రంగము—

---

(యుద్ధభూమిని శిబిరములో శక్తసింహుడు)

శక్త—ఇదే మేవారు నా జన్మభూమి యగు మేవార్.
నా మంతనమున మొగలసేన సువర్ణప్రసువగు నీదేశముపై
నేడు ప్రసృతమైనది-అచిరకాలమున నీ భూమి నిజసంతాన
రక్తపాతమున ఆర్ద్రమగును ము న్నేరక్తమును నిజసంతాన
మున కొసంగినదో దానినే నేడు మరలపుచ్చుకొను చున్నది
నరే-ఇచ్చి పుచ్చుకొనుచున్నది-అప్పు నేటితో తీరును
ప్రతాపా! నీకూ నాకూ ఇచ్చిపుచ్చుకొనుట నేటితో నంత
మగును నీవు నన్ను మేవారునుండి తరిమితివి, నే నాఋణము
నేను తీర్చుచున్నాను రావణుడు విభీషణుని లంకనుండి తరి
మెను, విభీషణు డాబదులు తీర్చెను నేను నట్లే ఋణవిము
క్తుడ నయ్యెద, నిన్ను మేవారునుండి పారదోలెద. ఈదేశ

మును చీల్చి చెండాడి శ్మశానము కావించి దానిపై ప్రేత వలె సంచరించెదన, అంతే- అంతకు మిక్కిలి సేయువాడ గాను. నా కీరాజ్య మక్కరలేదు, మొగలులనుండి మెట్ట పురస్కారమూ అభిలషింపను నా హృదయమున ద్వేషము గాని లోభముగాని హింసగాని లేవు కేవలప్రతాపఋణ విముక్తియే ప్రకృతిచేసిన అన్యాయమూ సంఘ మగపర చిన అవిచారమూ, రాజానగించిన స్వేచ్ఛాచారమూ, వీటికి నా చేతనైనంత వట్టు ప్రతీకార మొనర్చెదను. జాతిగొప్పగి, నేను కొద్దివాడను, కావున నొంటరిగా కార్యము నిర్వహింప నేరక పములనాహాయ్య మపేక్షించితిని-నే నొనర్చున దన్యా యమా? కాదు ఇందు రవ్వంతయూ అన్యాయము లేదు నాయెడ గిన్పరుఃబడిన ఘోరాన్యాయమును న్యాయమాప మున పరివర్తింప జేయుచున్నాను, ఉచితశాసనమునకు భం గము వాటిల్లె, నే నాభంగపాటు దొలగించి సర్వసమన్యాయ మును స్థాపించుచుంటిని, అన్యాయ మొనర్చుట లేదే! (మెహెర్ వచ్చును) ఎవరది?

మెహె—నే నక్బరషా కూతురను, నాపేరుమెహె రున్నిసా

శక్త—(లేచి) సార్వభౌముని కూతురవా? నా శిబిర మునకు రాగతమేమి?

మెహె—అయ్యా! నీవు ప్రతాపసింహుని సోదరు

డవు కదా ఆతని ప్రతిపక్షియగు పాదుషాపక్షమున నుండుట కు గతమేమి?

శక్త—ప్రతాపుని సోదరుడనే- అప్పాతీర్ప నిట వచ్చితిని.

మెహె—అట్లైన నీయుద్దేశము గంటె నాయుద్దేశము మహత్తరము, నేను మిత్రత్వ మూపాదించుటకు వచ్చితిని నీకు వింతగా నున్నదా?

శక్త—అదే ఆలోచించుచుంటిని

మెహె—నీ వాలోచింపకొనుము, నేను కూర్చుండెదను

శక్త—న న్నిట్లాదగిరపవచ్చుటకు హేతు వడుగవచ్చునా?

మెహె—ఆటంక మేమి? అడుగవచ్చును నే నొక చిక్కులో పడితిని

శక్త—ఏమి చిక్కు?

మెహె—గట్టిచిక్కే- సలీము నాతమ్ముడు, నేనూ దౌలతున్నిసాయును యుద్ధముచూచుటకు వచ్చితిమి ఇది నీ వెఱిగేయుందువు యుద్ధము చూడవచ్చితిమూ, యుద్ధమే లేదు అగణ్యాసేన యిట కుడిచి కూర్చున్నది, మే మిది చూచుటకు రాలేము. ఇక మాకు చేయుట కేమున్నది? ఇంత వరకూ దౌలతుతో మాటలాడుచుంటిని- దానికి నిద్రవచ్చెను బాబో! ఏమి నిద్ర! ఈగోలలో ఎవ్వరికైన గాఢనిద్రపట్టునా?

దానికి పట్టినది నే నొంటరి నైతిని, నీవుకూడ నొంటరిగా నిట నుండుట జూచి నీతో ముచ్చటింపవలయునని వచ్చితి, నీవు మంచివిద్వాంసుడవని సలీము చెప్పినాడు

శక్త—చిత్రముగా నున్నది నీచర్య!

మెహె—దీనిగూర్చి నీ వాలోచింపవలదు నేను సార్వభౌముని కూతుర నైనను మా యమ్మ రసపుత్రవనిత నీ మక్కువెముగ మెరుగని నేను హఠాత్తుగా నీతో మాట లాడవచ్చుట చిత్రమే. అంత పురస్త్రీని కావున ఇట్లు రాగూడ దని యెంచుచుంటివి కాబోలు? ఔను-ఇట్టి దృశ్యము నీ కపరిచితమై యుండును

శక్త—అపరిచితమే—దానికేమి గాని, నీ విట్లొంట రిగా అర్ధరాత్రవేళ నాశిబిరమునకు జొచ్చితివని వినిన సలీ మేమనుకొనును-సార్వభౌము డేమని యెంచును?

మెహె—ఆభయము నీకు వలదు, సార్వభౌము డేమియు ననడు, అతనికి నామాట ఉత్తమలక్ష్యము, నేను గీచినగీటు దాటువాడు కాడు ఇక సలీమా? అతడు మాత్ర మేమనును? నే నాతని తోబుట్టువును, పెద్దదానను, చిన్నతన మున పురుషులకంటె స్త్రీలు విజ్ఞులగుట నీ వెఱుగే యుందువు అందుచే సలీము నేనేమి చెప్పినా నమ్మువాడు గాని మాఱు పల్కజాలడు ఒకవేళ నేమైనయన్నను ప్రయోజన ముండ దు ఆ అడుగ మరచితిని, నీవు వివాహితుడవా?

శక్త—కాను నాకు వివాహము కాలేదు.

మెహె—అది దుఃఖహేతువే.

శక్త—ఏల?

మెహె—నీభార్యతో గూడ నీవు యుద్ధమునకు వచ్చినచో నేనామెతో పరిచయము చేసుకొని కాలక్షేప మొనర్చుచుందును నీకు పెండ్లి కాలేదా? వింతయే!

శక్త—ఏమి?

మెహె—నాకూ పెళ్ళి కాలేదు సరేకాని, నీ కేల పెండ్లికాలేదు?

శక్త—నిదుటవ్రాత-నా దౌర్భాగ్యము

మెహె— దౌర్భాగ్యమో, సౌభాగ్యమో నే నెఱుగనుకాని పెండ్లికూడు ఆచారము చాలకాలమునుండీ పారంపర్యమై యున్నది-ఇంక కొంతకాల మిట్లే యుండును ప్రేయసుల ప్రథమసంభాషణ ఎట్లుండునో యెరుగుదువా? విన కుతూహల మగుచున్నదా? నవలయందూ ప్రబంధముల యందూ వర్ణింపబడినరీతిని వారు మెలంగిరా, హాస్యాస్పదులు కాకతీరరు "ప్రియా! నీవు దగ్గరలేకున్న నేను జీవింపజాలను" అని నాయకు డనిన, "ప్రాణేశ్వరా! నిన్నొక క్షణమైన బాసి నచో నేను ప్రాణములత్యజింతును" అని నాయిక బదులు చెప్పును పెండ్లికిముందు వా రొకరినొక రెరుగరు మూడు నాల్గుదినములవరకే యీ ముచ్చటలు-ఒకరినొకరు వెతకు కొనుట-సరసము లాడుకొనుట-ప్రణయకలహములు-అనుక్షణ

విరహతాపము! అప్పుడు వారిని చూచినవారి కీమాటలు నిజ మనియే భావన కలుగును

శక్తి—నీ వెప్పుడును ప్రేమవాగురుల చిక్కుకొన లేదా?

మెహ—లేదు, లేదు-అట్టి సుయోగమిదివరకు నాకు లభింపలేదు ఇంతవరకు నేనెవ్వరినీ వలచులేదు న న్నెవ రైనా వలతురన్న ఆశకూడా లేదు-

శక్తి—ఏమి?

మెహ—పురుషు లెవ రైనా వలపువలలో చిక్కు కొనవలయునన్న స్త్రీ సౌందర్యవతి కావలయునట' ప్రబంధ ములబట్టి జూడ నాయకుడు గంధర్వకుమారుడు కావలయు, నాయిక అప్సరస కావలయు-కుమారుడు రాజకన్యావివా హముగూర్చి యెక్కడను వ్రాసియుండలేదు నా కన దినము నగపడున దట్టిదే.

శక్తి—ఎక్కడ చూచితివి?

మెహ—అద్దమున-నా రూప మేమియు బాగుగ నుండదు కన్నులు ఆకర్ణాంతములు కాకపోయినను వాటి యందు విశేషలోపము లేదు-కనుబొమలు-కలిసి మేళవించిన కమనీయము లట, నా కట్లులేవు-నా ముక్కుకొంచె మెత్తుగా నుండిన మేలయి యుండును ప్రకృతము స చప్పిడి- మా యమ్మముక్కు మాతండ్రిముక్కును అందమైననే - నా చెక్కిళ్ళు నొక్కుకొనిపోయినవి అబ్బే!-నేను ఏమీ బాగుం

డను, కాని, మా దాంతుచక్క నిసుక్క, నే నెంతకురూపినో ఆమె అంత రూపసి-నావలన స్త్రీలోకమునకు ఘటించిన. లోపము నామె తుడిచివేసినది-పరస్పరావలోకనమున నాకు లాభమెక్కుడు, నేను దివారాత్రము దివ్యసుందరవిగ్రహావలోకమునకనియుందున, ఆమె అద్దమే చూడను (సన్న్యాసిని వచ్చును) ఈమె ఎవతె?

శక్త—నీ వెవతెవు?

ఇరా—నా పేరు ఇర-రాణాప్రతాపసింహునికూతురను.

శక్త—అమ్మా! ఇరా! కూర్చుండుము-ఈ వేషమేల? కలగనుచున్నానా?

ఇర—కక్కా! కలగాను, నేను నిజముగా ఇరనే, నిన్నొకసారి చూచిపోదమని వచ్చితిని ఈమె యెవతె?

శక్త—అక్బరుపాదుషాకూతురు మెహరున్నిసా ఏమి యీవింత! మొగలు సార్వభౌముని కుమారియు మేవార రాణాకూతురును ఒక్కసారియే అనిమంత్రితలై వచ్చిరి!

మెహె—నీవు రాణావారికూతురవా? అమ్మాయీ!

ఇర—ఔను యువరాజ్ఞీ!

మెహె—నా కాగొప్ప యేమీ లేదు-నా బోటి కుమార్తెలు సార్వభౌమున కనేకు లున్నారు ఒకరు హెచ్చినను ఒకరు తగ్గినను ఆయనకు బాధాకరముగాదు యుద్ధము చూపుదని మాతండ్రిగారి నెన్నియోసారులు ప్రార్థించినా ఆత డియ్యకొనడాయె, కావున స్వైరవిహారధీగనై నలీము

వెంట వచ్చితిని-నా వెంట నామేనత్తకూతురు దొలతున్నిసా వచ్చినది

ఇర—ఆమె ఎక్కడ?

మెహె—నిదిరించుచున్నది ఏమిచెప్పుదు నానిద్ర ఎన్ని సాకులు చిక్కినను ఎంత గిల్లినను మెలకువ రాలేదు-ఇంత కోలాహలమందు ఆమె గాఢనిద్రాసక్తురాలైనది!

ఇర—కక్కా! నీతో మా టాడవచ్చితిని (ఊరకుండును)

మెహె—నేనిక్కడ నుంటినని సంకోచింపక మీరు హాయిగా మాట్లాడుకొనుడు-మీసంభాషణము ప్రకటింపవలదని మీరుకోరినచో నెవ్వరితోడను చెప్పను, నాతల తెగవేసినను సరే-నాచేత నేమైన కార్యమున్న నేనుకూడా మీతో చేరెదను, లేకున్న విని యూరకుండెదను నీపేరు ఇరా కదా? మంచి పేరు, రూపముకూడ కడులోభనీయము! మీరు మాటలాడుచుండుడు, నేనుపోయి మాదొలతును పిలుచుకొని వచ్చెదను, మిమ్ము చూచి ఆమె చాల సంతసించును (పోవును)

శక్త—నీ వొక్కతివే వచ్చితివా? అమ్మా!

ఇర—ఆఁ-నే నొక్కతెనే

శక్త—నిరాపదవై రాగల్గితివా?

ఇర—నిరాపదనై వచ్చుటకే సన్యాసినీ వేషము వేసితిని

శక్త—నీ విటవచ్చుట అన్నగా రెరుగుదురా?

ఇర—నేను చెప్పి రాలేదు

శక్త—అతనికి కుశలమా?

ఇర—శరీరకమాత్రము

శక్త—అత డేమి చేయుచుండును?

ఇర—ఇప్పుడు యుద్ధోన్మాదుడై యున్నాడు-ఒకప్పుడు యుద్ధప్రక్రియలు బోధించుచుండును, ఒకప్పుడు మంత్రణము నడుపుచుండును. ఇంకొకప్పుడు సరదారుల నుత్తేజితుల జేయుచుండును.

శక్త—వదినెగారో?

ఇర—ఆమెకు మాత్రము స్వస్థత యెక్కడిది? కడచిన రెండుమూడు రాత్రులనుండియు నిద్దుర లేక తండ్రిగారి తలవంక కనిపెట్టుకొని యున్నది. అతడు నిద్రలోకూడా యుద్ధప్రశంసయే పలవరించుచుండును. ఒకప్పుడు "పైబడుడ"నియు వేరొకప్పుడు "భయము వలద"నియూ "చింతపడకుడ"నియూ కేకలు వేయును ఒకప్పుడు కోపముతో గద్దించుచుండును, ఇంకొకప్పుడు "శక్తసింహా! తుదకు నీవు మేవారనాశమునకు హేతుభూతుడ వగుట నిజమాయె" అని కన్నీరు గార్చి, నిట్టూర్పు పుచ్చుచుండును. కడకు—!

శక్త—ఏమమ్మా?

ఇర—నీవు నాతండ్రిగారికి సోదరుడవయ్యు నాతని విపక్షమున కోరి మొగలుల జేరితివి కదా, హిందువువయ్యు

హిందువులపై కత్తిగట్టుటకు తగినంత హేతువున్నదా?

శక్త—నిరపరాధినగు నన్ను నీతండ్రి రాజ్యము నుండి నిర్వాసితునిజేసెను, అదియే కారణము

ఇర—అప్పుడు జరిగిన బ్రహ్మహత్య గంటివి కదా? నీవే దేశము నచ్ఛిన్నము జేయ నడుగట్టితివో, అట్టి మేవారమునకు పరమపవిత్రమగు మేవారమునకు—మన మాతృభూమికి—పాప మాబ్రాహ్మణుడు కోరి ప్రాణము లర్పించె. నీ పూర్వచరితము నొకసారి జ్ఞప్తికి తెచ్చుకొనుము శక్తా! సాలుంబ్రాధిపతి అనుగ్రహమున మృత్యుదేవత నోటినుండి బైట పడితివి పిమ్మట నీయన్న భ్రాతృస్నేహమున నిన్ను నిజరాజ్యమునకు రప్పించి సానుగ్రహముగ పెంచుచుండెను. అట్టి సాలుంబ్రాధిపతికిని అట్టి నీయన్నకును విరుద్ధముగా కత్తి నెత్తి వచ్చితివి నీ ప్రాణరక్షణము, మానరక్షణమును కావించినవారి మానప్రాణముల దీయ బద్ధకంకణుడ వైతివి! ఏమి కృతజ్ఞత! ఎంత ధార్మికుడవు! విద్వాంసుడవు విచక్షణుడ వగు నీకిది యుక్తకర్మమా?

శక్త—అమ్మా! నీవన్నది నిజమే కాని అట్టి భ్రాత నన్ను దేశము నుండి నిర్వాసితుని చేసెకదా? వానియెడ వైరమూని నేను కత్తిగట్టుట యుక్తము కాదా?

ఇర—సరే. అతంకవశుడై అన్న అపరాధము చేసిన పృథ్వీయందు క్షమ అనునది లేదా? అది నామమాత్రముగా గ్రంథములయందు తోచుచుండునా? శ్యామలమగు ఈ

యుపత్యకమున చూడుము దీనిని నరులు పశువులును పదదళితము చేయలేదా? నాగలిచే దాని గర్భమును వేధింప లేదా? ఆ పదాహతమును కర్షణమును సహించి భూదేవి వారికి సస్యాన్నప్రదానము సల్పుటలేదా? ఈ చెట్లులను చూడుము ఎంతటో వీటిని కొమ్మలు నరుకుచున్నారు, మృగములు మేయుచున్నవి, కాని అవి మరల చిగిర్చి మొగ్గతొడిగి కొమ్మలుపెట్టి వారికి నిలుచుటకునీడయు, తిను టకు తిండియు కూర్చుటలేదా? మిత్రకరతప్తజలబిందుతతి మేఘరూపమున నాకసమునకెగసి సకలజంతుసంతానమునకు స్వచ్ఛనీరము నొసంగలేదా? క్రోధమున మొదట గర్జించినను వెంటనే శీతలాశీర్వాదముభంగి సుమిష్టజలధారారూపమున జలాశయముల నింపుటలేదా? పృథ్వియంతయు హింసా ద్వేష, విషాదపూరితమా?

శక్త—పృథ్వియందు క్షమా యున్నది, ప్రతిశోధా యున్నది—నేను రెండవది శ్రేయమనియెంచి దాని స్వీక రించితిని ప్రతిశోధ విధి కాదా?

ఇర—దేనికి ప్రతిశోధ కర్మా? నీకు విధింపబడిన నిర్వాసనదండమునకా? నిన్నకారణముగ నీయన్న నిర్వా సితు నొనర్చెనా? మొదట ద్వంద్వయుద్ధసూచన చేసినవా రెవరు? అతడా? నీవా? ఆనాటి బ్రహ్మహత్యకు కారకు లెవరు?. పోనీ నిన్ను నిష్కారణముగనే నీసోదరుడు నిర్వాసితునిచేసె ననుకొనుము తత్పూర్వ మాతడు నిరాశ్ర

యుడవగు నిన్ను నిజరాజ్యమునకు రప్పించి పుత్రునివలె ప్రతి పాలన చేయలేదా?

శక్త—మొట్టమొదట నే నన్యాయముగ పరిత్యాజ్యుడనై ప్రతాడితుడనై దూరీభూతుడను కాలేదా?

ఇర—దానికి నీయన్న బాధ్యుడా? రాణాఉదయ సింహుడొనర్చినదానికి ప్రతాపు డుత్తరదాత యగునా? ప్రతాపుడు నీకేమి అపచార మొనర్చెను? అతడు నీ కాశ్రయ మిచ్చెను. నీవే దానిని చేతులార చెరచుకొంటివి, కావున నీవు వేరుకావలసివచ్చెను, అందు కాతని వంచింప నెంచుచుంటివా? ప్రతిశోధ మొనర్చుట దేనికి? నీ కాతడు చేసిన ఉపకారమును మరచితివా! అతడు నీకొర్చిన లగ్గును ప్రమగ్గించి, లేనియెగ్గును అగ్గించుచుంటివి ఏమి గుణగ్రహణ పారీణత!

శక్త—ఏమని ప్రత్యుత్తర మిత్తును? నేను భ్రాంతి పడినానా? (ప్రకా) దీనికి నే నుత్తర మివ్వలేను కొంచె మాలోచింపవలయును.

ఇర—ఈప్రశ్న అంత జటిలము కాదు, నీవూ వివేక శూన్యుడవు కావు. ఋజుబుద్ధి నాలోచించిన దీనికుత్తర మతిసులభము ప్రతిశోధ యంటవి, మంచిమాటే ప్రతాప సింహునిపై నీకు కసియున్న నాతనిమెడ ప్రతిశోధ యుండ వలయును, కాని స్వదేశమం దుండగూడునా? స్వీయదేశము, స్వీయజన్మభూమి! ఆమెపై నీకు ద్వేషమేల? ఆమె నచ్చి

న్నముచేయుటకే కదా మొగలసేన నింతదూరము లాగకొని వచ్చితివి, నిరపరాధినిపై నీ కేసేల? ఏ జన్మభూమిరక్షణార్థము నీసోదరుడు ప్రాణముల నర్పించుటకు ప్రస్తుతుడయ్యెనో, అట్టిమాతను పరులకు దార్చి నిజజాతిని పరపదదళిత మొనర్చుట ప్రతిశోధ అవునా? ఇట్టి ప్రతిశోధ రాక్షసులకు జెల్లునేమో కాని మానవులకు చెల్లదు, సోదరుల వివాదమున తల్లితల తన్నుటతగునా?

శక్త—ఇరా! నే నాబాల్యమూ జన్మభూమిక్రోడము నుండి వంచితుడను

ఇర—ఐనను నీ జన్మభూమి కాదా అది?

శక్త—పేరునకు మాత్రమే దానికీ నాకూ ఋణము లేదు.

ఇర—లేదే అనకో-నిరపరాధినియగు నిజమాతృభూమిని నిర్హేతుకముగాపరులపాలు చేయడమునకు నీవు పడు ప్రయాసము న్యాయమా? అత్యాచారము కాదా? ప్రతాపసింహుడు నీ కన్యాయ మొనర్చినట్టయితే సమాధానమిచ్చుట కాతడు బాధ్యుడుగాని మేవాడు కాదే?

శక్త—నీ వన్నది సత్యము! నేను చేసిన దన్యాయ్యమగునేని దానికి తగిన ప్రతీకార మొనర్తునని ప్రమాణము చేసెదను ఇంతదూరము ముందుకు వచ్చి యిప్పుడు వెనుకంజవేసిన వెంగలి నౌదును

ఇర—అసలు నా కీయుద్ధమే గిట్టదు తండ్రిగారితో

సర్వథా మందలించుచునే యుంటిని, కాని ఆతను నామాట పాటసేయలేదు యుద్ధము సిద్ధ మయినవెంటనే వాడియెడ పానుభూతి వహించితిని—ఆతడు తండ్రియనియు మొగలులు శత్రువు లనియూ కాదు, మొగలు లాక్రమణకారులు, తండ్రిగా రాక్రాంతులు, వారు ప్రభూతబలులు, మనము నిర్బలులము, ఐనను ధర్మము మనపక్షమున నున్నది, కావున మనకు జయము రావచ్చును

శక్త—అమ్మా! నీవాదము సప్రమాణము, నేనే భ్రమపడితిని నా యెఱుకలేమికి యథాసంభవ ప్రతీకార మొనర్తును, నమస్తే.

ఇర—ఈయాశయమును నీ మనమున దృఢపరుచుటకు ఈశ్వరుని ప్రార్థించెదను ఇదే ప్రణామము. ఇక నాకు సెలవిమ్మ

శక్త—నదుపుము, నిన్నంపి వచ్చెదను

ఇర—వలదు నేను సన్యాసినిని, న న్నెవ్వరూ బాధింపరు (పోవును)

శక్త—పోయిరమ్మా నీకు శుభమగుగాక! నేను విద్వాంసుడ ననియూ, విచక్షణుడ ననియూ అహమిక యుండెను, కాని నే డీబాలికచే పరాజితుడ నైతిని. ప్రతిశోధాంధకారము నాకన్నులు గప్పినది నేనుచేయునది ఘోరాన్యాయ సూత్రపాతమే దీనికి ప్రతివిధానము చింతింపవలయు

(దౌలతును తోడ్కొని మెహెర్ వచ్చును)

మెహె—ఇరా యేది?

శక్తి—ఇప్పుడే వెళ్ళినది

మెహె—మంచిపని చేసితివి! ఏమి న్యాయమిది? మహాశయా! నేను దౌలతున్నతో డైమ్ప్ట ఇరాదేవిని చూచి యామెతో మాటలాడుటకని యెరుగవా? మేము రాకుండానే అనాయాసముగ నామెను పంపివేసితివా! ఇదేమిపని?

శక్తి—కాంతామణీ, క్షమింపుము, నే నిదంతయు మరచితిని

మెహె—ఇంతలో మరచితివా! అనాహూతనై నీశిబిరమునకు వచ్చితిని- నేనైనను గొప్పయింటిదానను పాదపా కూతురిని గానన కో-నే నెంతో కష్టపడి, ఈమెను కష్టపెట్టి ఇంతదూరము మోసుకొని రావడము నిన్ను చూచుట కనుకొంటివా?

శక్తి—ఇంత మాత్రమున చెడిపోయినదేమి? ఇందు నష్టమేమి?

మెహె—లేగు-నీవూ చూడఁగినవాడవే, సుందరుడవు ముక్కు కొంచెము చిన్నదైన ముల్లోకమోహనుడవే.

శక్తి—ఈమె నీ మేనత్తకూతురా?

మెహె—ఔ( ఈమెయే దౌలతున్నిసా, చూడు చూడు-రూపసేనా? దౌలత్, మొగము కనబడనీయవేమే? మునుగు తీయవే

దౌల—చాల్చాలు (మునుగు దగ్గర లాగును) .

మెహె—తీయవేమే? నీమొగము సందము పులకం డమా? చూడగానే నోరూరి నోటిలో వేసుకొన్న అది కరగి పోవునట్లు నీచక్కదనము నోరులు చూచినవెంటనే చిక్కిపో వునా? ఇ టికిపోయి అద్దముచూచి నీయంద మేమైనా తరిగి పోతే నన్ను నీ చిత్తమువచ్చినట్లు శిక్షింపుము ఇతరు లెవ్వరూ లేమి-ఇంత సిగ్గేల? దృష్టిదోషము తగులు నను కొన్నావా? శక్తసింహుడూ అంటే కాడే నా కీజనానాపద్ధతి యన్న తలనొప్పి, తురకలలో నిది యొక దురాచారము; కాని ఒకానొకప్పు డిది మంచిదే-శక్తసింహా! మీా పూర్వ పురుషుడు భీమసింహునకు తనభార్య పద్మినీదేవిముఖ మల్లా యుద్దీనకు చూపకపోయినచో చిత్తూరుచరిత్రము మారియుం డునే చాలు! ఇక ముసుగు తీయవే- (బలవంతముగా లాగి) అయ్యా! ఈసారి చక్కగా చూడు, కనబడినదా? భువన సుందరి కాదా? జగన్మోహినియేనా?

శక్త—దివ్యసుందరీ! ఇట్టి రూప మిదివరకు నేను చూడలేదు దీని నెట్లు వర్ణింపవలయునో తోచకున్నది

మెహె—నేను వర్ణింపనా? నిస్తబ్ధనీరవనిశీథమున వీణాఝుంకారమువలె, నిర్జనవనమున స్ఫోటనస్థలపద్మముదీత్రి, ప్రథమవసంతమున ప్రథమమలయహిల్లోలముభాతి

దౌల—చాల్చాలు!

మెహె—ప్రథమయౌవనమున ప్రియసుల ప్రథమ మధుస్వప్నములీల

దౌల—(మెహెర్ నోరు మూయును.)

మెహే—నానోరు మూసెదవేమే? ఊపిరి తిరుగదు శక్తసింహా! నే ననేకగ్రంథములతో ననేకస్త్రీవర్ణనల చదివితి గాన ఇప్పుడు నూతనరీతిని వర్ణింతును ఈమె నిరుపమాన సర్వాంగసుందరి—ఏలయన ధాత యీమెరూపము నింత కన్న సుందరతరముగా జేయనెంచి, ఎచ్చట మార్చినను కమ నీయత తగ్గిపోవునని తలచి మార్పుసేయుట మానెను ఏమే! నాపై పెరవారి చూచుచున్నావు? కోపమా? ఈసా? శక్త సింహుని తదేకదృష్టితో తిలకించుచుంటివి, మోహించె దవునుమా?

దౌల—చాల్చాలు! ఇ వేటిమాటలు! పో పో!

మెహే— ఊ!హూ! ఇంతయు ప్రేమలక్షణమే తెలిసినది అందుకా అతని నొక్కమొగిని చూచుచుంటివి? చూపులు కలియునప్పు డధోముఖి వగుచున్నావు కర్ణమూల పర్యంతము కన్ను లెఱ్ఱవారినవి-ఎంత కోపమువచ్చినను "చాలు" అనుమాటతప్ప వేరుపల్కు లేదు-నన్ను పొమ్మనుచుం టివి? ఇవన్నియు చూడ ప్రబంధములలోని బయకారములకు నీ చేష్టలు సరిపడుచున్నవి వలచుచుంటివా? ఇంద్రజాలము! అతడు రాజపుత్త్రుడు, మనము మొగలులము-అయిననేమి? మా తండ్రిగారు మొగలుచక్రవర్తి అయినను మాయమ్మ రసపుత్రసతీమణి కాదా? వారికి వివాహము కాలేదా?

దౌల—చాల్చాలు (అని పోబోవ శక్తు డడ్డమగును, ఆమె నవ్వి పోవును)

మెహె—ఏమిదీ? శక్తసింహా! నీకుకూడా ఆమెస్థితియే సంప్రాప్తమయినట్లున్నది- ఎదురుగా నిలిచి ముద్దరాలి సద లింతువా? లేకున్న నామె నన్నువీడి శిబిరమునకు పోనుత్స హించునా! ఆమె నేల అరికట్టితివి? యుద్ధభూమి నిట్లు ప్రేమ పెరుగునని నే నెచ్చటను చదువలేదు, వినలేదు, చూడ లేదు- ఇంత వైపరీత్యమా? ఇకముందు బాగా ఆలోచించి సమయస్ఫూర్తితో సంచరించుచుందుము-అత్రము కూడునా ?

శక్త—వింతగొల్పు దంతిగమనలు! ఒకతె అపురూప సుందరి,యింకొకతెఅసాధారణమనీషిణి—దౌల తసమాన విలా సవతి, ఎదురుగా నిల్చి రెండుగడియలు తనివితీఱ చూడవలె నని యుండెను మెహెరుకూడా చూడదగినదే. ఎట్టిచపల! ఎట్టిరసిక!ఎట్టి ఆనందమయి!ఆశ్చర్యావహమగు నబలాయుగము

---

ఏడవ రంగము :—

[హల్దీఘాటీసమరక్షేత్రమున ప్రతాపుడు, అతని సర్దారులు]

ప్రతా—బంధుగులారా! నేడు యుద్ధము, ఆబాల్య ము మనమభ్యసించిన అస్త్రవిద్య నేడు పరీక్షచేయబడును. సార్వభౌముని సేనతో పోల్చిచూచిన మనసేన పిడికె డుండును రసపుత్రసైన్య మల్పమైన నేమి? మనవీరుల బాహుబాడల

ప్రవహించు రక్తము శక్తిని వీడబోదు చెప్పుటకు సిగ్గు, కంఠము బాష్పరుద్ధ మగుచున్నది, కన్నులు నీరుగ్రమ్ము చున్నవి ఈయుద్ధమున మనకెదురుగా పోరుచున్న సేనానులలో మన దేశీయులు-సజాతీయులు - దగ్గరచుట్టములు-నాతమ్ముడూ, నాయన్నకుమారుడూ ఉన్నారు వారంద రారితేరిన వీరులు-మనవీడు మాత్రము వెనుకబడునది కాదు, పిరికికండలేని పోటరులు పెల్లుకొనియున్నారు-ఇదిగాక న్యాయము మనపక్షమున నున్నది, ధర్మము మనపక్షమున నున్నది, రసపుత్రకుల దేవతలు కంటినిరెప్పవలె మనల కాచుచున్నారు-స్వదేశస్వధర్మోద్ధారణము కును, స్వాధీనతానిర్వహణమునకును, స్త్రీకన్యాదిశీలరక్షణమునకునూ మనము పోరుపొసగించుచున్నాము- మొగలులు యుద్ధము చేయుట మన ఉత్తమ కార్యము చెఱచుటకే మనవిపక్షుడు సామాన్యుడు కాడు, అనాదినుండియు అర్యులవశమున నున్న ఆర్యావర్తమును నేడు నిరంకుశాధికారమున నేలుచున్న పాదుషా అతని తనయుడు భావిభారతవర్షసార్వభౌముడు నగు సలీము యుద్ధభూమికి విచ్చేసెను సేనాధిపతి జగద్విదితాతివీరమదగజసింహుడగు మానసింహుడు కావున శాత్రవుల ఖ్యాతిని బలము నణచునట్లు మనశౌర్యమును, చలమును ప్రదర్శించి సమరముచేయుడు యుద్ధమున జయమే రానీ పరాజయమే రానీ-ఏది యైననూ మనశౌర్యము శాత్రవుల హృదయఫలకములయందు శాశ్వతముగాన నచ్చొత్తియుండునట్లూ, ఇతిహాసములయందు

మన చరితము సువర్ణాక్షరములతో లిఖింపబడునట్లు, మన పేరు విన్న మొగలాయిసామ్రాజ్యము గడగడలాడునట్లుగా మీరు పోరుసల్పవలయును జయసింహా! రామసింహా! మీరు చేవనోరుపతి జయమల్లుని పుత్రులు-చిత్తూరురక్షణార్థము హాహాకారంగా పోరి వైరుల ఆగ్నేయాస్త్రమునకాహుతియైన మీజనకుని ధైర్యసాహసముల మదినూనుడు సమరసింహా! శిశోదీయవంశవీరవరుడు వైరివీరజీమూతఝంఝామరుత్తనజెల్లు పుత్తుని వంశములోనివాడవు దుర్గమగువీరరంహా గోవిందసింహా! చందావత్ రోహిదాసూ! మీర లద్వితీయసమరప్రచండుడగు చండుని సంతతివారలు ఝాలాపతిమానా! మాననీయయశోమహిమాభిరాముడగు వీరవతంసములారా! మీ పూర్వపురుషులు అప్రతిమప్రతాపఖనులు-అసమానశౌర్యఘనులు- అమోఘబాహువీర్యధనులు! దేశరక్షణార్థమై ప్రాణోత్సర్గము కావించి అజరామరమగు యశఃకాయము స్వీకరించిన మహానుభావులు అట్టి మహనీయుల యంశముల నవతరించిన మీరు వారివలెనే దేశోద్ధారణమునకును, ధర్మరక్షణమునకును పోరుచున్నారు, కావున మీ కుల గౌరవమున, పెద్దల యశమును చిరస్థాయిగా నిలువబెట్టుటకు మనములు దిట్టపరచి సమరానలమున దుముకుడు జే! మేవారలక్ష్మికి జే!

అందరు—రాణాప్రతాపసింహునకు జే!. (పోవుదురు)

(సఖీము మహాబతులువత్తురు)

మహా—రాకుమారా, ప్రతాపసింహుని పోల్కి తగి లినదా?

సఖీ—లేదు ఏడీ? ఎక్కడు న్నా డాతడు?

మహా—ఆ లోహితధ్వజము కనబడుచున్నదే, ఆ వంక చూడుము దానిక్రింది తేజస్వియగు నీలాశ్వము పైనున్నాడు-ఉచ్ఛశిరము! ప్రసారితవక్షము హస్తమందలి ఉన్ముక్తకృపాణము ప్రభాతభానుకిరణచ్ఛవిని శతధా దీర్ణితమొనర్చుచున్నది, ప్రక్కనున్న వాడియైన బల్లెము త్రిశూలమును ధిక్కరించుచున్నది-మూర్తీభవించిన వీరరసమో యనునట్లు వెల్గుచున్న రనపుత్రుడే ప్రతాపసింహుడు

సఖీ—ఆతని కుడివైపుననున్న విరు డెవడు?

మహా—ఝూలాపతి మానా, ప్రతాపున కీతడు కుడి భుజము వంటివాడు

సఖి—ఎడమప్రక్కను?

మహా—పాలుంబ్రాంధిపతియగు గోవిందసింహుడు-రసపుత్ర సర్వసేనాధిపతి-అమితశౌర్యసంపన్నుడు

సఖీ—ఆహా! ఆవీరుల ముఖము లెంత విశ్వాసపూరితములు! వా రెంతదృఢమనస్కులై మనపై దాడియాడుచున్నారు ఛీ! ఏమి మొగలసేన-రాతిబొమ్మలవలె నిశ్చలులై నిలిచియున్నారు-పోరు సల్పుదామా?

మహా—మనపై వారు పడువరకూ ఓర్చి యుండ

వలయునని సేనాధిపతి మానసింహు నాజ్ఞ!

సలీ—ఏమి వాని మాధ్యము? నే నిప్పుడే వారిని దాకెదను

మహ—యువరాజ! మానసింహు నాజ్ఞ వేరుతెర గున నున్నదే

సలీ—మానసింహు నాజ్ఞయా? నేను దానికి లోబడు వాడను గాను. నా యంగరక్షకుల నైదువేల రమ్మను నేను శత్రువుల చెనకెదను.

మహ—శలభము వహ్నిమీద జను చందమున రస పుత్రశౌర్యాగ్నిలో దుముకజూచెదవా? వలదు, రాకుమారా! వలదు ప్రమాదము తప్పదు సుమా!

సలీ—మహాబత్, నీవుకూడా నన్ను ధిక్కరించుచుం టివా? పొమ్ము వెంటనే

మహ—చిత్తము (వెళ్ళుచు) కానున్నది కాక మానదు

సలీ—ఈ మానసింహునాజ్ఞ సర్వసంక్రామకమై సైన్యాధ్యక్షులయందు వ్యాపించినది- సామాన్యసైన్యాధ్యక్షునికి గల అధికారమైనా నాకు లేదు, న న్నెవరూ లెక్కచేయ కున్నారు మ త్త మానసింహా! నీరేఖ ఉచ్చదశను వెల్గు చున్నది- ఈయుద్ధము సాంతము కానిమ్ము, నీగర్వమును ఖర్వము చేయకున్న నాపేరు సలీము కాదు (పోవును)

(ప్రతాపుడు సరదారులు వత్తురు)

ప్రతా——ఏడీ, మానసింహుడు?

మానా——తన శిబిరమున నున్నాడు-ప్రభూ! మీ మకుటము నా కిండు

ప్రతా——ఏల?

మానా——దానిజూచి ప్రతివాడూ మిమ్ము పోల్చుకొనగలడు

ప్రతా——నష్టమేమి?

మానా——శతృవులు మీపై నాక్రమణ మారంభింతురు

ప్రతా——మంచిదే ప్రతాపసింహుడు ప్రచ్ఛన్నుడై పోరుసల్పువాడు కాడు ఆత డందరికీ అగపడవలయును సలీమూ, మానసింహా! మహాబత్, రండు-మీకు సాహసమున్నచో, మీకు సాధ్యమైనచో నాతో ద్వంద్వయుద్ధమునకు గడంగుడు

మానా——రాణా, నామనవి నాలింపరా?

ప్రతా——ఊరకుండు, మానా అత డెవడు?

మానా——ఆతడే సలీము (ఉన్ముక్తఖడ్గుడై సలీము వచ్చును)

సలీ——ప్రతాపసింహుడవు నీవేనా?

ప్రతా——ఆహా! నేనే

సలీ——నేను సలీమును, నాతో యుద్ధమునకు రమ్ము

ప్రతా—అటులనా? సాహసివే సహస్థలమునకు పో
దాము పద

ప్రతా—(తిరుగ వచ్చి) ఓహో! యువరాజా! ఉత్తర
కుమారప్రజ్ఞలా నీవి? (మహోబత్ వచ్చును)

మహో—ఆఁ ప్రతాపా! ఆగు మాగుము బాలుని
బెదరింతువా? ఇదియా నీప్రజ్ఞ?

ప్రతా—ఓరీ! కులాంగారమా! మహోబత్, వృద్ధుడవు
నీవు రమ్ము యుద్ధమునకు నీయుద్ధతి ఊహించెదను (యుద్ధ
మున ప్రతాపుని చుట్టూ వైరు లాక్రమణము చేయుదురు,
మానా కడకు గోవిందసింహుడు వచ్చును)

మానా—గోవిందసింహా! మహోబత్ ససైన్యుడై రా
ణాను చుట్టవేసెను శీఘ్రమే పోయి ప్రభువునకు తోడ్పడుద
ము, రమ్ము [పోవుదురు

(ప్రతాపుడు మానాయు వత్తురు)

ప్రతా—మానా, ఎట్లున్నావు?

మానా—ప్రభూ, ఇక నాపై నాశ విడువుడు నేను
సాంఘాతికుడ నైతిని

ప్రతా—అయ్యో! మానా, నాకొరకు నీవు హతుడ
వైతివా? నీవడ్డుపడకున్న నన్నా హతకు లంత మొందించి యుం
దురు, నీ ప్రభువిశ్వాస మతిప్రశంసనీయము నీయెడ నాకృత
జ్ఞత దెల్పుటకై నీకు వంశపారంపర్యముజరుగబడు గౌరవముల
నొసంగెద-మారాండమండలమండితంబగు మాలోహితధ్వజ

మును బోలిన ధ్వజముక మీాదు ధరింపవచ్చును, రాజబిరుద ము మీాసంతతికెల్ల చెల్లుబడి యగుగాక, నీవు నాకు దక్షిణ భుజము వైతివి కావున మీాకు మాగద్దెకు కుడివైపున నాసన మొసంగెదను మీాకు భేరీకాహళాదులు మాకోటగుమ్మముల వరకు ప్రయోగించుచు రావచ్చును.

మానా—ప్రభూ! ఈగౌరవము నా కొసగినందుకు నాసంతతివారితోగూడ నేను మీాకు చిరకృతజ్ఞుడను నేను మరణించితినా రాజస్థానమునకు లోటులేదు మీా రిటనుండి వెడలుడు-శక్తు డీదిక్కునకు ససైన్యుడై రాగలైనా మీారక్షణ మసంభవము- ఇప్పటికే బల ముక్కుదక్కి యున్నది

ప్రతా—మానా, మరణమన్న నీకు చింతలేదుకాని నాకా చింత? శక్తుడే కాదు శంకరుడు రానిమ్ము, వెనుదీ యను, సజీవుడనై యుండునంతవరకూ సమరము మానను శరీరములు శాశ్వతములా?

మానా—ప్రభూ! మనసైన్య మంతయు నిర్మూలిత మయ్యెను ఇక జయించునాశ లేదు అదే విపక్షవిలయతరంగ మాసన్నమయ్యెను

ప్రతా—కానిమ్ము-కత్తి చేత నుండునంతవరకూ కసి మసంగక మానను, కలను వీడను

మానా—అయ్యో! రాణా! ఈ మొగలసేనాప్రవాహ గతినిరోధ మెవరితరము? నామాటవిని ప్రాణ ముండజూడ కొనుడు-ఇంకొకసారి పోరి జయింపవచ్చును

ప్రతా—మానా! యథేచ్ఛము వీరస్వర్గమునకు జను చున్నావు నేనూ కొద్దికాలమున నిన్ను చేరెదను ఓలమాన గొని ప్రాణములు దక్కించుకొనువాడు కాడు ప్రతాపుడు (పోవును)

మానా—అమ్మా! కాళీ, ఇకంతయు నీ విలసితమే నా? మాయందు దయ తప్పినదా? రాణాప్రతాపసింహునకు మంగళము చేకూర్పుమా, తల్లీ! (మృతి)

—ఎనిమిదవ రంగము—

(శిబిరములో శక్తిసింహుడు)

శక్తి—యుద్ధ మారంభమయినది-విపుల ఘోరయుద్ధము ఘనగరజనమును హాసి చు ఫిరంగుల రవము ఉన్మత్తసైనికుల ఉత్కట చీత్కారము—అశ్వ హేషలు—గజ బృంహిత ములు- యుద్ధభక్కాల యుచ్చనాదము-మరణోన్ముఖుల ఆ ర్తనినాదము యుద్ధము సాగుచున్నది! ఒకవైపున అగణ్య మొగలసేన-ఇంకొకవైపున వింశతిసహస్రరసపుత్రవీరగణము- వారికి ఫిరంగు లున్నవి వీరికి ధనుర్బాణములు, శస్త్రము లు, బల్లెములే ఆధారము మహారాణా! ప్రతాపసింహా! నీ సా హస మసామాన్యము ధన్యోసి, ధన్యోసి నేడు నీ యద్భుత వీర్యమును కన్నులార గాంచితిని, రసపుత్రుడవు—సోదరుడవు కావున గర్వితమతి నగుచున్నాను స్నేహాశ్రువులు వర్షభి దు

వులరీతి నొల్కుచున్నవి భక్తిపూర్వకముగా గర్వలుంఠితశిర
ము వంచి నీపాదములపై బడవలెనని యున్నది ప్రతాపా!
ప్రతాపా! ప్రతిమొగలసైన్యాధ్యక్షుని నోటనూ నీ యసామాన్య
వీరత్వగాథలనే వినుటచే గర్వమున నా తను వుప్పొంగెను.
ఈ సుందరమేవారభూమినామూలమున పరపదదళితమును
పరసైన్యప్లావితము విధ్వస్తము నగుటచూడ నాశిరము సిగ్గుచే
వ్రాలుచున్నది. వీరభూమి యిష్టమగు రసపుత్రసేనను, చిరపరి
చితయు రత్నగర్భయు నగు మేవారురాజ్యమును మొగల
వాహినీప్రవాహసంఘట్టనమున నిట్టిదశకు తెచ్చినమూఢుడను
నేనే కదా? ఛీ, ఎంతటిమూర్ఖుడ! అహమిక నన్నెంత చేసెను రహ
స్యమార్గమును చూపి రసపుత్రరాష్ట్రమునకు కీడు మూడచేసి
నది నేనే- ఈలజ్జ, యీ పరితాపమును నాతలను వంచినవి
దేశద్రోహము, బంధుద్రోహము, భ్రాతృద్రోహము, నొన
ర్చిన పాపిని, ఛీ! నాజన్మము నిరర్థకము- నాయుద్ధతి యంత
యు నూడెను (మహోబత్ వచ్చును)

మహోబత్, యుద్ధక్షేత్రమున వార్తలేమి?

మహో—బాగుబాగు! ఘోరయుద్ధము సాగుచు సేనా
నులందరును రణాంగణమున పోరుచుండ నీవు నిస్తబ్ధుడవు కుశ
లివినై శిబిరమున హాయిగా శయనించి యుంటివి! ఇదేనా నీ
వీర్యమూ, నీ శౌర్యమూ?

శక్త—నా కార్యములకై నన్ను సమాధాన మడుగు
టకు నీ వెవడవు? నేను స్వేచ్ఛావిహారినై సమరమునకు వచ్చి

తిని గాని సేవకుడవగు నీవలె రాలేదు

మహా—సేవకుడవు కావేమి? ఆశ్లైన ఇన్నిదినాల నుండియు పాదుషాకోటలో వున మాగధకృత్యము కేల కుదురు కొంటివి? స్వేచ్ఛావిహారి కొకరి ఆశ్రయ మేల?

శక్తి—మహాబత్ - ముందువెన్క లారసి మాట లాడుము

మహా—ఏమి?

శక్తి—నా మానసికవ్యవస్థ బాగుండనందున చిత్తము నకు శాంతి చేకూరలేదు లేకున్న శక్తసింహుడు పోరుపొసగు నపుడు ఊరక కూర్చుండువాడు కాడు

మహా—మాటలు కోటలు దాటును, కాలు గడప దాటదు! నీ వీరత్వము వెల్లడి అయినది లే!

శక్త—ఓరీ, వాగాడంబరా, నేను పిఱికినో భీరు డనో యించుక పరీక్షింతువా?

మహా—అందుకు సిద్ధుడనే-వ్యర్థప్రలాపీ, రమ్ము (కత్తి దూయును)

(తెరలో) "ప్రతాపసింహుని శిర మెవరు తెచ్చిన వారికి తగిన పారితోషిక మిచ్చెదను" అని కేక వినబడును

శక్త—మహాబత్, ఇది సలీము కంఠధ్వని వలె నున్నది ప్రతాపుడు పోరుడిగి పారిపోయెనా? వాని శిరమును తెమ్మని సలీము కోరుచున్నాడు. నాకిదే తగిన యదను, నీ వించుక నే పాగుము (పోవును)

మహా—అత్యద్భుతముగా నున్నది వీనిచర్య. ఈతను తప్పక ప్రతాపరిక్తపిపాసువై పోవుచున్నాడు ఏమి విధివిలసితము! ప్రతాపసింహా! నీ భ్రాతుష్పుత్రుని కరవాలాఘాతమున భూపతితుడవైతివి, నీరక్తముచే తనకత్తిజప్పి తీర్ప నీభ్రాత నిన్న వెంబడించుచున్నాడు! తుదకు నీవారిచేతనే నీకు కీడు మూడుచున్నది! (పోవును)

—తొమ్మిదవ రంగము—

(నదీతీరమున చైతక కళేబరముచెంత ప్రతాపుడు)

ప్రతా—సర్వము సంపూర్ణమయ్యె, మూడునాళ్ళ ముచ్చట! నాపదిహేను వేలబలము నేలపాలయినది, నాప్రియ ఘోటకము చైతకము నిహతమయ్యె, మూడు కత్తివేటులు, మూడు బల్లెపుపోటులు, ఒక గుండుదెబ్బ-వీటిచే నేను రక్తసిక్తాంగుడనై యీ నదియొడ్డున చేరితిని, దుర్బలుడ-శ్రాంతుడ భూపతితుడను-నన్నిక్కడి కెవరు తెచ్చిరి! చిరసంగియు, విశ్వాసియునగు నా అశ్వము చైతకము! నేను విపత్క్రాంతుడనౌట నెరింగి నన్నిచటికి తోడ్తెచ్చెను. కరోరరశ్మి సంయుతమయినను, ఆపదను, బాధను, నిషేధమును మన్నించక యిచటికి పరుగెత్తి వచ్చెను. నిజప్రాణరక్షణార్థము కానే కాదు నిజప్రాణసమర్పణము చేసి నాప్రాణమును రక్షించుటకు

(తెరలో నల్లగుర్రపు రాణా! నిలు, నిలు")

ఎవరి దీ అపరిచితస్వరము? నేను పారిపోవుచున్నానని మొగల సైన్యాధ్యక్షు లెంచుచున్నారు చైతకమా, ప్రభుభక్తచైతకమా, వినుచుంటివా వారి పల్కులు? యుద్ధక్షేత్రమున మన మిద్దర మొకసారి మరణించుట సంభవింపదాయె శాత్రవులు గేలిసేయుచున్నారు-ప్రతాపుడు యుద్ధమున వెన్నిచ్చి పారిపోయెనని పకపక నవ్వుచున్నారు-మిత్రమా, నీవు మరణించుటకు సిద్ధముగానున్నతరినాయాజ్ఞనేల ఉల్లంఘించితివి? ఎప్పుడైన నట్లు చేసితివా? ఆ లజ్జచే అసువుల విడిచితివా? ధన్యోసి! ధన్యోసి!! నేను మాత్రముతలయెత్తుకొనలేను-కానిమ్ము-కడచినదానికి వగవనేలకాలుచేతులుబట్టపీలికలవలెతూగాడుచున్నవి—నో రెండుచున్నది-బాధ మిక్కుటమగుచున్నది శత్రువులొనన్నెరిగి ఏమి అవమానము జరుగనున్నదో? ప్రాణభంగమున కోర్తునుగాని మానభంగమున కోర్వజాలను ఈశ్వరా! నీవే దిక్కు-దరిజేర్పుము

(ఖొరాసానీ మూల్తానీలు వత్తురు)

ఖొరా—ఇదిగో ప్రతాపుడు భండనమునుండి పలాయితుడై యిట పడియున్నాడు అదే నల్లగుఱ్ఱము చచ్చి పడియున్నది

మూల్తా—అతడు ప్రాణములు బాసెనా? దరికి పోవుదమా?

ప్రతా—లేదు లేదు. ఇంకను జీవించి యున్నాను యుద్ధ మింతటితో ముగిసెనని మురియుచుంటిరా? పాపులారా!

రంము. మిమ్మిద్దరిని నాఖడ్గమునకు బలియిచ్చెదను

మూల్తా—తలదాచుకొన్నా తప్పదు నీకు మరణము!

ఖోరా—లేచి సమస్థలమునకు రమ్ము (పోవుదురు)

ప్రతా—(తిరుగవచ్చి) ఈ పిరికిపందలు నాకు జడిసి కాళ్ళకు బుద్ధిచెప్పినారు వారు మరల వచ్చునరకూ శ్రాంతి చెందెదను

(తెఱలో నల్లగుఱ్ఱపురౌతా నిలు, నిలు!

ప్రతా—ఓహో, వీరిద్దరే అనుకొంటిని, ఇంకెవరో వచ్చుచున్నారు ఇక లాభము లేనట్లు తోచుచున్నది, కాని మ్మా, ఈశ్వరేచ్ఛ-పోరుమాననుప్రభూ! దీనదయాళూ! నీవేదిక్కు (మూర్ఛిల్లును ఒకవైపునుండి ఖోరాసానీ మూల్తా నీలు వేరొక వైపుననుండి శక్తసింహుడును వత్తురు తురకలు ప్రతాపుని గవియు)

శక్త—ఆగు డాగుడు శ్రాంతుని చంపగూడదు ఒకనిపై నిద్దరు గవియుదురా? ఇదియా మీ సమరనియమము? తుచ్ఛులారా! మూర్ఛిల్లియున్నవాని ముగియ జూచెదరా?

ఖోరా—వీడొక రాజద్రోహి ముందువీని ముగింతము

శక్త—అది మేలైన మాట!

మూల్తా—ఓరీ పిరికిపందా, ఏమని పేలితివి?

శక్త—జాలమేల? ముక్తికాంత మిమ్ము ముద్దుబెట్ట నున్నది రండు (తిరుగవచ్చి) ఇక భయములేదు ఇతని కాపద మూడజాలదు అన్నా, అన్నా, మూర్ఛిల్లి యున్నాడు

ఇంచుక నీరు తెచ్చెదను (నేపథ్యమున) అన్నా! అన్నా! నేనుమా?

ప్రతా—ఎవరది? శక్తసింహా!

శక్త—మేవారసూర్య డస్తమించలేదు! అన్నా, నేనే—అనుప్రతాపా! ప్రతాపా! కన్నువిచ్చి నన్ను గాంచుము

ప్రతా—తమ్ముడా? నీకు బాధా నైతినా? కాలవైపరీత్య మిట్లున్నదా? ఊఁ నన్ను సజీవునిగ సార్వభౌమునకు సమర్పింపక నాశిరమును చేరిగొని నీహస్తిభువగు నలీమున నుపాయముగ గొనిపొమ్ము యుద్ధభూమిని సమర మొనర్చుచు చావవలెనని పాకులాడితిని, కాని ఆ తరుణమున ఎందుచేతనో నా ప్రియఘోటకము తలపట్టి మొగ్గిపోయినట్లు కఠోరరశ్మి సంయుచుండు నకుచేయక, చేనెత్తి మొరపెట్టుచున్నను వినక, తానమితబాధనొందుచున్నదాని నురాంగణమువెలువడిచావు పరుగున నన్నీడ్చుకొని వచ్చినది అచ్చటనే చచ్చియున్నా నాకే చింతయు లేకయుండును బందీనైతినన్న పరాభవము ప్రాప్తింపక పోయి యుండును దాని ద్వేషింప సజీవునిగా నన్ను శాత్రవులకు సమర్పింపకుము తమ్ముడా! శక్తసింహా! తప్పాడితిని తమ్ముడా అనిపిలిచి నీచిత్తమును కరుణాస్ఫీతముగ చేయ గమకింపను నీ విప్పుడు జయప్రదుడవు నేను జితుడ, నీవు భాగ్యచక్రమున నుచ్చపదవినుండున్నావు, నేను నీచపడితిని, నీవు నిలువబడియున్నావు, నేను నీకాళ్ళ

యొద్ద బూడెలో పొర్లాడుచున్నాను, శ్రాంతుడను, గళితబలు డను, నిన్ను నేకోరే దొరకదే. నేను నీకొనర్చిన మహాపరాధ మునకు ప్రతిగా నన్ను మొగలుల కర్పించుట నీయిష్టకర్మ గదా? అది వద్దనయు నేను నీకేదేనా ఉపకారము చేసితినని నీ వెంచినచో, అందుకు వినిమయముగా దీనుడనై నేను యాచించు యీసామాన్యభిక్ష నొసంగుము బ్రతికియుండ నన్ను పరులపాలు చేయబడద్రోయకుము ఇక్కడే చంపుము నా ప్రసారిత వక్షమున ప్రకృష్టశస్త్రఘాత కావింపుము అగ్రసోదరునకు అమూల్యమగు ప్రత్యుపకార మొనర్చినవాడ వౌదువు? నా మాటవిని నన్నిక్కడ చంపుము (శక్తసింహునకు కత్తిని పారవేయును)

శక్త—సోదరా, ప్రసారితమగు నీవక్షమున నన్నాను ము తప్పానరించితిని, దండింపుము, లేదా, క్షమింపుము. నీ తమ్ముడను

ప్రతా—ఆ మొగల భటద్వయము నంత మొందించి నా మానప్రాణములు కాపాడినది నీవేనా?

శక్త—అన్నా, వీరుల కద్వితీయాదర్శుని, స్వదేశ రక్షకమణి, రాజపుత్రకులగౌరవధనియు నగు ప్రతాపసింహ మార్తాండుడు మ్లేచ్ఛదుర్గ్రహగ్రసితుండౌట రాజపుత్రుడు గాంచగల్గునా? అన్నా, నీవిట్టి ఉత్తమవ్యక్తి వని లోగడ నెఱుంగక నీకంటె నేనే శ్రేష్ఠుడనని దలంచుచుంటిని ఇది పరీక్షచేయవలెననియే నాడు నిన్ను ద్వంద్వయుద్ధమునకు పురి

పొల్చితిని నేటియుద్ధమున నీవే శ్రేష్ఠుడవని తెల్లమయ్యె నేన తుచ్ఛుడనని యెఱిగితిని, నీవు వీరోత్తముడవు నేను కాపురుషుడ నీచమగు ప్రతిశోధాపిశాచముబట్టి జన్మభూమికి సర్వనాశము నాపాదించితిని నిన్నెప్పుడు రక్షణసేయజాలితినో అప్పు డింకను మేవారరక్షణాశ కలదని ఉప్పొంగితిని- రాజ పుత్రకులప్రదీపా, మేవారభూపా! వైరివీరరంహా! ప్రతాప సింహా! పురుషోత్తమా, దీనదయాళూ, పాపుడను, నాతప్పు సైరించి నన్ను మన్నింపుము

ప్రతా—తమ్ముడా, శక్తసింహా! నే డెంత సుదినము! నామానమును రక్షించి ప్రాణముకు కాపాడితివి- ధన్యులము-

(కౌగిలింతురు)






# మూడవ అంకము

## మొదటి రంగము

సలీము, మొగల పరిషద్గణము- శక్తసింహుడు

సలీ—శక్తసింహా! ప్రతాపసింహు డెట్టి యాపదా లేక పలాయితు డగుటకు దాయి యెవరు?

శక్త—నీ వడిగినప్రశ్న సమంజసముగా నున్నది ప్రతాపసింహుడు యుద్ధక్షేత్రమునుండి కోరి పారిపోవువాడు కాడు అట్టి అపవాద కతడం దాయికాడు

అంబరు—స్పష్టమైన యుత్తర మిమ్ము అతని పలాయనమునకు సాధనభూతు లెవరు?

శక్త—ముఖ్యసాధన మాతనిగుఱ్ఱము చైతకము

పృథ్వి—(దగ్గును)

సలీ—ఆతని పలాయనమునకు నీ వెట్టిసాయమైన చేసితివా? లేదా?

శక్త—ఆతని పలాయనమునకు నే నెట్టిసాయమును చేయలేదు

బికా—అట్లయిన ఖోరాసానీ మూల్తానీ లెట్లు గతిం చిరి?

శక్త—కత్తి వేటుచేత

పృద్వీ—(దగ్గుచు)

అంబ—శక్తసింహా! నిన్ను పరిహాసకము చేయడ మున కిచ్చటికి రప్పించలేదు ఇది విచారణాలయము.

శక్త—మహారాజా! అలాగా? ఇది అత్తవారిల్లనీ నేను పెండ్లికొడుకు ననియు, సలీము పెళ్ళికూతురనియు, మీరు శ్యాలకులనియూ భావించుచుంటిని

పృధి—(నవ్వును)

(చాందేరి మొదలగువారు కోపముతో

శక్తసింహుని చూతురు)

సలీ—శక్తా, సరియైన ఉత్తర మిమ్ము.

శక్త—అట్లయిన ప్రశ్న నీ వడుగుము బట్రాజులు వీళ్ళడిగిన నాకు తలనొప్పి, గాదెక్రింది మొలకలు—

సలీ—మొగలసర్దారుల చంపినవారెవరు ? కారణమేమి?

శక్త—వారిని నేను చంపితిని, మా అన్నను రక్షణ చేయుటే కారణము

చాందే—నే నట్లే ఊహించితిని

శక్త—నీ బుద్ధిశక్తి బహుసున్నితమయినది!

అంబ—నీవే అట్లార్చితివా కృతఘ్నా! విశ్వాస ఘాతకా! భీరూ! తుచ్ఛా!

శక్త—అబ్బో! ప్రభువుకన్న నీగ్లే బంటు వీవు! భగ వాన్ దాసూ, జయపురాధీశా, నేను విశ్వాసఘాతకుడను కృతఘ్నుడను, కాని భీరుడను కాను, తుచ్ఛుడ గాను,కుత్సితు డనూ కాను, గాయములచే కాయము స్రుక్కి యుద్ధశ్రాంతుడై మూర్ఛపోయిన మాయన్నను వధింప నిద్దరు పటానులు సిద్ధమైతే, నే నొక్కడనె వారితోపోరి ధర్మయుద్ధమున వారిని పిల్చుమార్చితిని హత్యచేయుట లేదు నేను భీరుడనా?

సలీ—విశ్వాసఘాతకుడవని ఒప్పుకొందువా?

శక్త—ఆహా, ఒప్పుకొందును ఇం దాశ్చర్యమేమి? విశ్వాసఘాతకుడు విశ్వాసఘాత యొనర్పడా? ఇంతకుముందు నేను స్వదేశము నకు విరుద్ధముగా, సోదరునకు విరుద్ధముగా మొగలులతో కలిసి విశ్వాసఘాత ఒనర్పలేదా? అందుపై నింకొకటి! నే నిట్టివాడనని ఎరిగె సార్వభౌముడు నా కాశ్రయ మిచ్చెను ప్రతాపుని చంపుటకు మారు అతనికి సంభవింప నున్న నికృష్టపుచావు తప్పించి మీయెడ విశ్వాసఘాతకుడ నైతిని ఆతడు నాకు సోదరుడు ఎట్టి సోదరుడు! ఏ వీరుడు హీనాస్త్రుడయ్యు చతుర్గుణసైన్యముతో పోరెనో, ఏమహానుభావుడు దేశోద్ధారణకై వనములయందు కొండలయందునూ వనట యనక కుందుచుండెనో, ఏశూర కేసరిపై మా రాజ్యభారము వంశగరిమయు నిభృతమయ్యెనో,

అట్టి శూరశిఖామణికి అధములచే అన్యాయమరణ మాస న్నమై యుండ తప్పించకుందునా?

అంబ—ఏప్రతాపుడు పర్వతదస్యుడు, రాజద్రోహి, దేశద్రోహి.

శక్త—ఓహో! ప్రతాపసింహుడు దేశద్రోహియా! మీరు దేశభక్తులా కాబోలు?

సలీ—ప్రతాపుడు రాజద్రోహి కాడందువా? మూర్ఖా!

శక్త—అతడు విద్రోహియు అక్బర్ చిత్తూరుకు న్యాయాధికారీ అగునా? ఔను, రాజనీతి పరిభాషయందు అన్ని పదముల యర్థమూ వికృతి చెందును, ఎట్లనగా, పట్ట పగలు నెత్తులుకొట్టుట పేరు "దాడి" లేక "ఆక్రమణము"— బలవంతముగా దేశమును పెఱుకుకొనుట పేరు "జయము"- అపహృతరాజ్యమును అనర్గళముగా మొగలుల ననుభవింప నిచ్చిన "శాంతి"—అట్లొనర్చుచు గడ్డికఱచి ప్రభువులకు నీచమగు దాస్య మొనర్చినవారు "రాజభక్తులు"—అపహృ తరాజ్యమును ఆక్రమింప యత్నమొనర్చువారు "విద్రోహు లు"—బలే! ఏమి నిర్దిష్టాభిధానములు! అతితుచ్ఛుడూ, ఘృణార్హుడూ ఈ పారిభాషిక చాతురిని ప్రశంసార్హు డగును, ఉచ్ఛస్వాంతుడు, మహోదారుడు నీ యింద్రజాల మున పరిభవార్హు డగును ఏమి చమత్కారము!

సలీ—సార్వభౌము డెట్టివాడని నీ యూహ?

శక్త—అతడు గజదొంగ, కాని తేడా ఇది—దొంగ

హామ్ముల నపహరింప దొరగారు రాజ్యముల నపహరింతురు

సలీ—పొగరుబోతా! నిన్నిప్పుడే చెరలో త్రోయిం చెదను విశ్వాసఘాతకు తగినశాస్త్రి నెరుగుదువా?

శ క్త—మృత్యువు- అంతకన్న నెక్కు- డుండునా? సలీమ్, నేను క్షత్రియుడను, అందునూ రసపుత్రుడను, మృత్యువునకు జంకువాడనుకాను అట్లు జంకిన సత్యము పల్కి-యుండను- ఆభయమే ఉన్నయెడల కోరి మీశిబిరము నకు మగిడివత్తునా? నిజము చెప్పిన నాతప్పు సైరింతువని నేనెన్నడూ ఊహింపలేదు మీతో కూడి చాలాకాలము మెలగితిని, మిమ్ము బాగా ఎరుగుదును నీతండ్రి నెరుగు దున, అతడు కూటనీతిపటుడు, వివేకహీనుడు, చతురుడు, కపటి—నిన్నెరుగుదున, నీవు నిర్బోధుడవు, అనతురుడవు, మూర్ఖుడవు, విద్వేషపరాయణుడవు రక్తపిపాసువగు పిశాచ మనదగుదువు

సలీ—నేను కూడా నిన్నెరుగుదును. నీవు గృహహీను డవు, ప్రతాడితుడవు, మొగలోచ్ఛిష్టభోజివి, చెప్పులుకొరుకు చెనటీకుక్క-వు మూర్ఖా! కల్పిజ్జి జేసెదవా? విశ్వాసఘాతకు శాస్త్రి మృత్యువని నీవే చెప్పితివికదా? ఈయవజ్ఞకు శాస్త్రి యిది (తన్నున) వీడిని చెరలో త్రోయండి- రేపు కుక్క- లచే తినిపింతాము (పోబోవును)

శ క్త—సభికులారా! క్షణమాత్రము నన్ను మోచన ముసేయుడు, పిదప మీరాయిచ్చవచ్చినట్లు శిక్షించండి అం

తటి వీరు చిటలేదు సలీమ్, ఇందుకు తగిన ప్రతిక్రియ చేయక పోతే నేను రసపుత్రుడనుకాను—

---

—రెండవ రంగము—

---

గదిలో మెహెర్, దౌలతులు

దౌల—శక్తసింహుని జంపుమని సలీము ఆజ్ఞాపించెనా?

మెహె—అవును అన్న ప్రాణము రక్షించబోయి ఆతడు తనప్రాణమునకే భంగము తెచ్చుకొనెను.

దౌల—నిజమేనా? లేక పరియాచకమా?

మెహె—మంచి పరియాచకమే సలీమునకు చెలగాటము కాని శక్తునకు ప్రాణసంకటము! ఎంతధైర్యమున్నా ప్రాణములు తీపుకాదా?

దౌల—శక్తసింహున కంతకఠినశిక్ష విధించడమునకు గతమేమి?

మెహె—అంత మొందించుటే-సలీముబుద్ధికి శక్తుని సృజించుటలో విధాత తప్పుచేసినట్లు తోచెను.

దౌల—ఎట్లు?

మెహె—కాళ్ళుచేతులు, అంగప్రత్యంగములు-యథాయోగ్యస్థానముల నుంచెను కాని శరీరమునకు తగిన శిరస్సును మెడపై నమర్చలేదు ఈ విషయమును సలీము ఎక్కుడగా గ్రహించి ఆశిరమును మెడను వేరుచేసి లోటు తీసివేయనెం

చెను కాని చిత్రము! శక్తసింహుడు ప్రతివాదము నప్పనే లేదు.

దౌల—దేనికి ప్రతివాదము?

మెహె—ప్రతివాదమునకు చోటే లేదా! తగనీ-తగకపోని-భగవంతుడు చేసిన పని కదా? సలీమునకభ్యంతర మేల ఉండవలెను? ఎవడైనా మనశిరము తెగవేస్తావంటే మన కేలా గుండును? మాటాడవేమి? నీముఖము సుద్దవలె వెల్లబారినదేమే?

దౌల—మెహెర్, నీవు వానిని రక్షింపజాలుదువు అతనికి ప్రాణదండన విధించితే నే నొకక్షణమైనా బ్రతుకజాలను. నమ్ము. అట్లైన నేను విసముమెసవి అసువుల త్యజించెదను, ఇదే ప్రమాణము చేసెదను

మెహె—ప్రాణములు విడిచిన విమవును-ఇంత బడాయి యెందుకు? ఇంతకుముం దెందరు ప్రేయసులు ప్రాణములు బలి యివ్వలేదు? పుస్తకములలో చదువలేదా! ఆత్మహత్యయం దేమి మహత్త్వ మున్నది? ప్రపంచమంతటా చాట బంపుదుగా? అట్లుచేస్తే అట్టివారిలో చేరుదువు

దౌల—అతని ప్రాణమును కాపాడ నుపాయాంతరము లేదా?

మెహె—ఉపాయ మొకటే తోచినదా! ఆత్మహత్యా? అది నీవు చేయుదువా? ఉపాయాంతరము తోపదా?

ఒకమాట-ఆత్మహత్య కావింపదలచినచో నీపేరు శాశ్వత ముగా నిల్చున ట్లొనర్చుము

దౌల—ఎట్లు?

మెహె—పట్టు తివాసులు పరచిన గదిలో, ముఖ మల్ పరుపుమీంద జరీదుప్పటి కప్పి, మణులుచెక్కిన బంగారు గిన్నె చేతబట్టి, ముత్యాలుగుప్పిన చీనాంబరము గట్టి, ఏడు వారాల సొమ్ములుబెట్టి, విషము గిన్నెలో పోసి, కమలముల బోలు కరముంతో నీబింబాధరమునకు రాసి, చుబుకము నెత్తకుండ నోరు తెరవకుండ, పెరచేత వీణె ధరించి, శక్తసిం హు నుద్దేశించి పాటబాడుము - భైరవి రాగము ధృవ తాళము - అంత చైతన్యము జరిపోవును, సర్వాంగములూ సడలును. అదే భావనతో నసువు లూడిపోవును ఆలాగు చేస్తే నీపేరు ప్రసిద్ధిగాంచును, కీర్తి హెచ్చును, చిత్రకారులు బొమ్మ వ్రా యుదురు, కవులు నాటకములు రచింతురు, విద్వాంసులు ఆడు దురు, జనులు చూచెదరు, అందరూ సంతసింతురు

దౌల—మెహెర్, హాస్యమున కిదే నీకు సమయము ?

మెహె—ఇంతకన్న నెక్కుడు సుయోగములభించునే? ఇద్దరు నొకసారియే చూచుకొన్నారు కుంజమూ లేదు, నదీపు లినమూ కాదు, చంద్రాలోకభాస్వరంబగు ప్రాదముపై నౌకా వక్షమున కాదు, మసుగులేను యుద్ధక్షేత్రమున, సామాన్య శిబిరమున, ఇంకొకతె యెదుట, అదీ సంధానకారిణి-అత్యంత గద్యమయావస్థయందు- హఠాత్తుగా దృష్టులు తారసిల్లి, అట్టె

ప్రేమ పరిణమించెను అతని చూడకున్న అసువులు నిలువవు
పృథ్వీయుంతా ముంభూమిపద్రశమయ్యెను, పిమ్మట నాత్మ
హత్య ఘటిల్లనున్నది ఇట్టితరుణమున పరిహాసము చేయుకుంటే
ఇంకెప్పుడు? నీవు నాకు మేనత్తకూతురివి కావా? ఇంకెవరిని
హాస్యమాడుదునే?

దౌల—ఇందు కేయుపాయమూ నాకు తోచలేదు
నీ వీ కార్యము నిజముగా నిర్వహింప జాలవా? సలీము చెంతకు
పోయి శక్తుని వదలుమని నీవు చెప్పిన నాతడు వినడా? ఇంకేది
గత్యా?

మెహె—నీ వొకటి చేసినివా అంతా సరిగా చక్క
ఐపున

దౌల—ఏమి చేయుమందువు? సాధ్యమైనట్లైతే
చేయుటకు సిద్ధురాలను

మెహె—నీవు కళ్ళుమూసుకొని ప్రాణ మీక్షణమే
పోవునో, ఇంకొక క్షణములో పోవునో అన నట్లు పడియుండు
ము యూనాని వైద్యులు, ఆయుర్వేదజ్ఞులు, ఆంగ్లేయ చికి
త్సకులును ప్రవేశింతురు ఎవరికినీ రోగతత్త్వము తెలియబో
దు, నాడిలో నేమియు నగపడదు నే నప్పుడు సలీముకడకు
పోయి “మందూ వద్దు మాకూవద్దు దీనికి భూతము పట్టెం
డి, దానిని కుదుర్చ మాత్రము శక్తసింహునికి తప్ప ఎవ్వరికి
నీ తెలియదు, వానిని పిలిపించినగాని ఈమె జీవింపదు ” అని
చెప్పెదను వెంటనే సలీము కబురంపును, శక్తుడు వచ్చును,

మాత్రము పరించి నీచేయి పట్టుకొనుచు, మీయిద్దరికి సమావే శముగుచు, అంతట తెరజారుచు, అంకరము సంశసించుము

శాల—మెహెర్, మన కిద్దరికి దేహములు రెండైనా, జీవ మొకటే నేను తెలిసియుండినదానను నన్నిట్లు బాధపెట్టుట నీకు తగునా? బుద్ధిమంతురాలవు, ఉపాయశాలి నివి, నీవుగాక నాకెవరు దిక్కు? పతిభిక్ష కొనంగి ప్రాణములు నిల్పుము (ఏడ్చును)

మెహె—దౌలత్, దౌలత్, ఏడ్చుచున్నావా? ఊరకుండుము ఏడువకు, కన్నీరు తుడుచుకో, భయము వలదు నేను శక్తసింహుని తప్పక రక్షింతును అట్లు చేయలేకున్న అతని ప్రాణములు పోవుచున్నప్పుడు పరిహాసకము చేయుదునా? నీ ప్రస్తుతావస్థకు నీవు దాయివి కావు, అందు నీతప్పు లేదు, మీ ప్రథమ సందర్శనమునకు కారణభూతురాలను నేను— నీప్రేమకు తగినదోహద మొనర్చి అభివృద్ధిచేసినది నేను—

నే నేకార్యము చేయబూనినను గాని నసంపూర్ణముగా విడుచుదానను కాను భగవత్సాక్షిగా ప్రమాణముచేసి చెప్పుచున్నాను శక్తసింహుని ప్రాణములు తప్పక కాచెదను. అంతే కాదు-నిన్నాతనికి పెండ్లిచేసెదను, అంతవఱకూ నిద్ర పోను, తిండి తినను-ఇదేమే! కన్నీరు గంగాప్రవాహ మగు చున్నది! నామనముమాత్ర మిప్పుడు స్వస్థముగా నున్నదని యెంచితివా? అబ్బా! వచింపజాలను పొమ్ము, నిదురింపుము (ఆమె పోవును) అయ్యో! దౌలత్, నా పరిహాసవాక్యముల

లో నెట్టి అగ్ని లీనము యున్నదో నీకెఱుంగజాలవు. అయాయిసగాలా! శక్తా! నిన్ను నాహృదయమునుండి పార దోలుట కెంతయత్నించుచుంటినో, అంతదృఢముగా నందుపా దుకొనుచుంటివి వేయిసార్లు తొక్కిపెట్టినాను హాస్యము చేసి తిని. వ్యంగ్యము లాడితిని—కాని అగ్ని చల్లారదాయె! మొ దట నీ రూపమూ విద్యయూ నాదిమోహించితిని, ఇప్పుడు నీశౌర్యము, వీర్యము, ఔదార్యమూ నిన్ను నాదైవముగా నొనర్చెను, కావున ప్రేమ దుర్భరమయ్యెను నిన్ను చూడ కుండజాలను. అబ్బా! మోహము నిర్భర మగుచున్నదే ఈప్రవృత్తి నణగద్రొక్క వలయును, నా సుఖమునకై కాదు, అబోధయు, అనాశ్రయురాలు నగు బాలతనసుఖముకొరకు- ఆమె నాహృదయమందలి వాత్యాచక్ర మెరుగదు, భగవంతు డెరుగును- ఏమి యీవ్యధ! ఏమి యాతన! హా దైవమా, దీని నణగద్రొక్కు శక్తి నాకు ప్రసాదింపుము ఈవిషయ మితరు లెరుగకుండునట్లు నాకు వరమిమ్ము. (సలీము వచ్చును)

సలీ—మెహెర్, ఒక్కర్తె విక్కడ నేమి చేయుచుం టివి? బాలతేదీ?

మెహె—ఇప్పుడే లోని కేగినది, వచ్చునులే, సలీమ్, నీవు శక్తసింహునకు ప్రాణదండనము విధించితివటా?

సలీ—ఔను

మెహె—వాని నెప్పుడు చంపింతువు?

సలీ—రేపు కుక్కలచే నీడిపించెదను.

మెహె.—నీవు చిన్నవాడవు- ప్రాణము తీయునంత ప్రాపు మించినా రాలేదు అది యొకయాట అనుకొంటివా?

సలీ—ఏమీ' నేను బాలుడనా? చక్కగా విమర్శగా విచారణ చేసి శిక్ష విధించినాను

మెహె.—సావధానుడవు కమ్ము- విచారణ అను పేరున ఎన్నో హత్యలు జరుగుచున్నవి నీకు విచారణచేయు నధికార మెవ్వరొసంగిరి?

సలీ—ఒకరివ్వనేల' సార్వభౌముని పుత్రుడను కానా? నాకట్టి అధికారము లేదా?

మెహె.—అలాగా? నేనుకూడా సార్వభౌముని పుత్రికనే, నీకంటె పెద్దదానను, కావున అట్టి అధికారము నాకూ కలదుకదా?

సలీ—ఐతే, ఏమంటువు?

మెహె.—శక్తసింహుని విడుదల చేయుము

సలీ—నీమాట విని కాబోలు?

మెహె.—ఆహా నామాట వినే—

సలీ—బాగుబాగు

మెహె.—ఇది నవ్వులాట కాదు అతని విడువుము- లేదా—

సలీ—ఏమి చేయుదువు?

మెహె.—స్వయముగా శక్తుని ముక్తుని చేసెదను. నన్నాపుట కెవరితరము కాదు ఆగ్రావాసులందరూ నన్నె

సుగుదురు.

సలీ—తండ్రిగారించుక చనవిచ్చుటచేత నీకు గర్వము బలిసినది

మెహ—మాటలెందుకు శక్తసింహుని విడుతువా?

విడువను.

సలీ—విడువను అతడు మనసర్దారుల నిరువుర హత్య చేసెను.

మెహ—హత్య చేయలేదు, ధర్మయుద్ధమున వారిని చంపెను

సలీ—ధర్మ యుద్ధమా? విశ్వాసఘాతకుడు- మాపక్షమున జేరి—

మెహ—ఆతనిచర్య పరమేశ్వరునికికూడా ప్రియతమము, స్వర్గీయమాతృభూమికంటెను ఆతడు సోదరు నారీతి రక్షింపక చంపెనేని నీవు అతని ప్రశంసచేయుదువు కాబోలు!

సలీ—సందియమేమి?

మెహ—అట్లు చేసియున్న ఆతని 'ఛీ' అనవలెను సలీమ్, సృష్టియందు ప్రభుభృత్యసంబంధము గొప్పదా! సౌభ్రాత్రముగొప్పదా? ఈశ్వరుడు నరుల సృజించునప్పుడు కొందరిని ప్రభువులుగను మరికొందరిని భృత్యులుగనూ సృజింపలేదు - కాని సౌభ్రాత్రము జన్మముతో బుట్టి ఆమరణము విచ్ఛేదము కొందదు ప్రతాపసింహునెడ ద్వేషము పూని ప్రతిశోధమై మొగలదాస్యము నాతడు స్వీకరించిననాడే ఆ

ప్రతిశోధమే మేఘము క్షణభంగురమని మీరు తలచియుండవల
సినది. అది ఎంత విస్తృతమైనను, ఎంత వికటమైనను ఎంత
కుత్సితమైనను, భస్మవేషము గల సౌభాగ్యము సుమా- ప్రతి
శోధ తీవ్రవారి హృదయములయందు ప్రేమ లోపించు
ననుకొంటివా? చిరస్నిగ్ధమధురమౌ యీ హిల్లోలము అప్పుడ
ప్పుడు భీషణఝంఝామారుతము ధరించినను, అది ఎంతో
కాల ముండేది కాదు.

సలీ—బళే! మెహెర్, శత్రుసింహుము న్యాయవాద
నివలె ఉన్నావు! నీతో నాకు వాదమేల? నీవు వానిపక్షము
వహించుచున్న వింత కాదు, వానియెడ నీకనురాగ ముండుట
అరుదా? తత్ప్రణయాభిలాషిణివి!

మెహె— సలీమ్, తెలిసీ తెలియని మాటలాడకుము,
నీ తెలివితేటలకు నాకిచిత్తపరీక్ష చేయబూనెదవేమి?

సలీ—నే నెరుగననుకొంటివా? అర్ధరాత్రమున వాని
శిబిరములో నీవు దూరలేదా?

మెహె—ఈమాట నన్నడుగుట కధికారము నీకు
లేదు, అందుకు నీకు సమాధానమిచ్చు బాధ్యతా నాకు లేదు.

సలీ—సరే! సార్వభౌమునెదుట నీయుకిందువా?

మెహె— నా ఘోష నీకేల? శక్తసింహుని పడదువా?

సలీ—మంచిది. నీచేతనైనది చేయుము. (పోవును)

మెహె—సరే చూచెదము చేయగలనో చేయలేనో

(పోవును)

—మూడవరంగము—

చెఱసాలలో శక్తసింహుఁడు

శక్త—రాత్రి సమాప్తమగుచున్నది—దానితో నా క్షుద్రపరమాయువుకూడ సమాప్తమగును నేటిప్రభాతమే నాజీవితమందలి చరమప్రభాతము పేశలహృష్టపుష్టమగు నా దేహము నేఁడు రక్తసిక్తమౌట సందరూమాతుదు ఆ బీభత్సదృశ్యమును చూడనివాఁడను నొక్కఁడనే- నే నెవఁడను? ముప్పదివత్సరములకు పూర్వ మెచ్చట నుంటిని? రే పెక్కడ నుందును? ఈప్రశ్న కుత్తరము నేఁడు తెలియఁగలదు (మెహె రువచ్చును) ఎవరది?

మెహె—నేను మెహెరున్నిసాను

శక్త—సార్వభౌముని కూతురవా?

మెహె—ఔను-నేనే

శక్త—బహుప్రయాసమునొంది ఇచ్చటి కెందుకు వచ్చితివి?

మెహె—మృత్యుముఖమునుండి నిన్ను తప్పించుటకు.

శక్త—న న్నుద్ధరించుటకా? ఎందుకూ? ఆవిషయము న నేనణుమాత్రమైనా ఆగ్రహోష్ఠుఁడను కానే?

మెహె—అదేమి? నీకు జీవితముం దాసక్తి లేదా? అతి సుందరమగు అవనిని త్యజింపవలెనని నీకు కోర్కె కలదా?

శక్త—ఔను ప్రపంచమంతయూ పాతగిల్లినది అనుదినము ఆసూర్యుడే, రాత్రుల నాచంద్రుడే- ఆ నక్షత్రములే- అవే ఉదయించి అస్తమించుచున్నవి, ఎటుచూచినా ఆ చెట్లే ఆ జీవులే- అవే కొండలు, అవే నదులు—ఒకటే ఆకాశము సర్వము పురాణమే మత్యువునొంది యీసంసారసాగరమున కద్దరిని వింత లేవున్నవో చూడవలెను

మెహె—జీవింపవలెనని ఔత్సుక్యము లేదా?

శక్త—లేదు నేటివరకూ జీవితమునందలి ఎచ్చుతగ్గుల గాంచినాను అది సమూల మసారము, సంతసము, సున్న, మృత్యువెట్టిదో చూడవలెను అనుదినమూ దానికీర్తి వినుచున్నాను, స్ఫూర్తియూ కనుచున్నాను దాని నిజరూపము కనబడలేదు కావున నేను కాంచెదను

మెహె—ప్రియజనమును విడిచిపోవుట నీకు ప్రయాసము కాదా?

శక్త—ప్రియజన ముండిన అట్లగునేమో-నాకు పృథ్వియం దెందునూ లేదుగా ప్రియజనము, ఒకరిని నేను ప్రేమించి యెరుగను, న న్నొక్కరు ప్రేమించిరని వినలేదు, కనలేదు. నేనెవరికిని అప్పుపడలేదు, అప్పంతా తీర్చివేసినాను (స్వ) ఆం ఒక్క ఋణము మాత్రము మిగిలినది—సలీము నన్ను తన్నిన దానికి బదులు తీర్పవలెను, (ప్ర) ఒక్కపని మాత్రము మిగిలియున్నది

మెహె—దాని నిర్వహింప నిష్టము లేదా? చెరనుండి

విముక్తి గోరవా?

శక్త—యువరాజ్ఞీ, ఒకసారి మోచనము చేసితివేని త్వరలో ఋణముతీర్చి మరల వచ్చెదను. నీచేతనైన నొకసారి విడుదలచేయుము

మెహె—చెరకాపరీ, సంకెళ్ళు విప్పుము ఈ హారమును గొమ్ము. దీనివెల లక్షరూపాయలుండును, కావున నీభరణపోషణాదులకు లోప ముండదు పోయి హాయిగా బ్రతుకు (వాడుపోవును)

శక్త—నారీమణీ, ని న్నొకటి అడుగవలెనని యున్నది, నా విడుదలయందు నీ కింత పట్టేల? నా మృత్యువన నీ కింత వెర పెందుకు?

మెహె—అది తెలియుటవల్ల నీకు ప్రయోజనమేమి?

శక్త—వేడుక కడిగితిని

మెహె—(స్వ) చెప్పనా? నష్టమేమి? ఇప్పుడే తేలిపోవును (ప్రకా) అయ్యా, నాసఖి దౌలతున్నిసా నీకు జ్ఞప్తి యున్నదా?

శక్త—లేకేమి?

మెహె—ఆమెకు నీయం దనురాగ ముదయించెను

శక్త—నాయందా?

మెహె—ఆహా, నీయందే నీవుకూడా ఆమెయం దనురాగి వనే నా నమ్మకము అసత్య మందువా?

శక్త—నావిడుదలవలన నామె కేమిప్రయోజనము?

మెహె—అది యామెనడుగుము - తెల్లవారనున్నది. నీవు ముక్తుడవు, అశ్వము సుసజ్జితమై యున్నది, నీయిచ్చవచ్చినచోటికి పోవచ్చును, ఎవరూ నిన్ను బాధింపరు. చాలతును పెళ్ళియాడవలెనని—

శక్త— వివాహమా! రసపుత్రుడనై యవనస్త్రీని పెండ్లియాడుటయా? శాస్త్రానుసార మిది సంభవమా?

మెహె—మీశాస్త్రానుసార మిది సంభవమే మీ పూర్వులు బప్పారావుల్లు యవనస్త్రీల వివాహమాడలేదా?

శక్త—అది అసుర వివాహము

మెహె—ఏదో వివాహము కాదా? ఇక శాస్త్రమా? శక్తసింహా, శాస్త్ర మెవరు చేసినారు? వివాహమునకు శాస్త్రమొకటే వలపు-ప్రేమ ప్రేమబంధమును తెంచుట శాస్త్రమునకు శక్యమా? నదులు సముద్రమున పడునప్పుడూ, ఉల్కలు పృథ్విపై బడునప్పుడూ, మాధవీలత సహకారమును పెనగొనునప్పుడునూ పురోహితుని మంత్రోచ్చారణ అపేక్షించునా?

శక్త—శాస్త్రభీతి నాకు లేదు- సనాతనధర్మమును ధిక్కరించి సంఘమునుతల దన్నువానికి శాస్త్రము సమ్మానభాజన మగునా?

మెహె—అట్లైన ఈ వివాహము నీకు సమ్మతమేనా?

శక్త—(స్వ) ఇం దెగ్గేమి? ఇదొక చిత్రము-ఇంతవరకూ స్త్రీలచిత్తవృత్తి పరీక్షచేయలేదు. ఇప్పుడు దానికి గడంగదను.

మెహె.—ఆమెను భార్యగా నంగీకరింతువా?

శక్త.—అంగీకరించెదను

మెహె.—ధర్మసాక్షిగా,

శక్త.—ధర్మమును నేను మన్నించువాడను కానని చెప్పలేదా?

మెహె.—మన్నించు మాను "ధర్మసాక్షిగా" అనుము

శక్త.—ఆఁ ధర్మసాక్షిగా!

మెహె.—శక్తసింహా, అమూల్యమగు నా హారమును నాగళమునుండి తీసి నీగళమున వేయుచున్నాను ఆమె కవమానము రాగూడదు- దైవముసాక్షి సుమా!

శక్త.—దైవమే సాక్షి-అవమానము రానీయను.

మెహె.—మువ్మాటికి?—

శక్త.—మువ్మాటికి (వ్వ) ఇంతవరకూ నాచరిత మతిగంభీరముగా నడచుచుండెను-ఇంతనుండీ అది ప్రహసనము కానున్నది, కానీ

మెహె.—ఇక నడువుము- తెల్లవారుచున్నది—(పోవుదురు)

— ఐదవ రంగము.

(గదిలో అక్బరు సలీములు)

అక్బ—సలీమ్, మానసింహుకు ని న్నవమానించలేదు ఆతడు నాయాజ్ఞానుసారము కార్యక్రమమునిర్వర్తించెను

సలీ—ఇంతకన్న నెక్కు డవమాన మింకేమున్నది? నేను ఢిల్లీశ్వరుని పుత్రుడను, అతడు సేనాధిపతి, సేవకుడు హాల్దీఘాటీ యుద్ధక్షేత్రమున నాయాజ్ఞకు విరుద్ధముగా నాచరించుట న న్నవమానించుట కాదా? ఇట్లొకసారి కాదు— పలుసార్లు—

అక్బ—ఇం దతని అపరాధమేమి?

సలీ—మానసింహుని అపరాధము మీకు కనబడదు. అతడు మీశ్యాలకపుత్రుడు కాడా? మీరు నెత్తిమీద నెక్కించుకొనుటచేత అతని యౌద్ధత్యమునకు మీరే కారణభూతులగుచున్నారు

అక్బ—సలీమ్-ఆలోచించి మాటలాడుము అతని యపరాధమేదో చెప్పవేమి?

సలీ—నాయాజ్ఞ మన్నింపక ఆతనికి తోచినతీరున నడచుటే

అక్బ—అతడు సేనాధిపతి కావున అట్టియధికారమాతనికి కలదు సమరమున సర్వాధికారము వహింప నాతడు సమర్థుడు-బాలుడవు యుద్ధప్రక్రియ నీ కేమి తెలుసును?

సలీ—అట్టివ న న్నాయుద్ధమునకు పంపిన ప్రయోజ
న మేమి?

అక్బ—ప్రయోజనమా? యుద్ధమర్మముల నేర్చుకొన
డ మే

సలీ—వాని అధీనమున కర్మచారినై లొంగి లొంగి
వెంట తిరుగుటకా?

అక్బ—కుమారా, ఈగర్వమును విడువు, భారతవర్ష
మునకు భావిసార్వభౌముడవు రాజ్యముల నెట్లు గెలువవలయు
నో, గెలిచినరాజ్యముల నెట్లు పాలించవలెనో గమనించుచుం
డుము-మానసింహునకు నాయం దెంత మమతాభక్తివిశ్వా
సము లున్నవో నీవెరుగవు వాని బాహుబలమూ యుద్ధకుశల
తచేతనే కదా ఆర్యావర్తము గాంధారము కూడా వశపరచు
కొనగల్గితిమి- మన మాతనికి ఋణస్థులము కామా?

సలీ—ఋణమా? మీరు ఋణస్థులేమో కాని నేను
కాను

అక్బ—అట్టి యౌద్ధత్యమే వద్దంటిని ఇతరుల శాసిం
పదలచువాడు ముందు తన్నుతాను శాసించుకొనవలెయును
మానసింహు నెడ నాకు మన పూర్వకప్రేమ యున్న దనుకొం
టివా? ఆతడన్న నాకు బెదరు సుమా వానిమూలముననే నా
కార్యముల నిర్వహింపుచూ అవి ముగిసినతోడనే జీర్ణవస్త్ర
ముభాతి వాని విడిచెదను. మన కార్యసిద్ధి కడతేరువరకు నా
తని మన్నించపక తీరదు.

సలీ—అగు మీయూహ, కాని నేను రసపుత్రప్రభు
త్వస్వీకారము కావించువాడను కాను ఈ యవమానమునకు
మీరు ప్రతీకార మాచరింపని యెడల దైవసాక్షిగా చెప్పు
చున్నాన నాచేతులతో నేను తత్ప్రతిక్రియ గావింతును
ఆతడు ప్రభువో నేను ప్రభువునో అప్పుడు నిశ్చితమగును.

అక్బ—సలీమ్-నేను జీవించునంతకాలము సార్వభౌము
డను నేను కాని నీవు కావు ఏమి! విద్రోహివలె ఎట్టివారి
చూచుచున్నావు? సార్వభౌముడవు కావలెనన్న ముందువెన్క
లారసి మాటలాడుము, లేనిచో మోసమగును

సలీ—మీ యుత్తరాధికారిని నియమించుట కేవల
ము మీ చేతిలోనిపని కాదు (పోవును)

అక్బ—అయ్యో! తండ్రు లెంత బాధ్యులు! సంతాన
మునకై ఎంతో పాటుపడి ధనమార్జింతురు చెప్పుచేతలకు
లొంగి తిరుగవలసినవారు దుర్వినీతవ్యవహారులైనచో నావలె
నిస్సహాయభావముతో సహింపవలసి యుండును కదా? హా!
దైవమా, తండ్రుల నిట్టి స్నేహదుర్బలుల జేసితివేల? ఈయవ
మానమును నోర్చుక నేను సహింపవలయునా? అయ్యో!
అయ్యో! (మెహెర్ వచ్చును) మెహెర్, నీపై గొప్పనేరము
మోపబడినది గానికి శిక్షనను శాంతము నీ వీయవలయును

మెహె—జొల నేరము మోపినవాడు సలీము ఆ
వృత్తాంతమంతయు నాతడు చెప్పియుండును, నేను చెప్పవల
సినది మనవిచేసుకొనుటకే వచ్చితిని

అక్బ—శక్తసింహుని వెర బాపిన దెవరు?

మెహే—సార్వభౌమా, నాచేతులతో నేను వానిని ముక్తుని చేసితిని.

అక్బ—దాలతు నేమి చేసితివి?

మెహే—ఆమెను శక్తసింహుని కిచ్చి వివాహము చేసితిని

అక్బ—గొప్పపని చేసితివి! అక్బరు సార్వభౌముని మేనగోడలు శక్తసింహుని పెండ్లియాడుటా? విధర్ములను మొగలకన్యలు పెండ్లియాడుదురా?

మెహే—మహాప్రభూ! ఈవిషయము క్రొత్తగాదు మీతండ్రిగారాదారి చూపించిరి, మీరుకూడ దానినే త్రొక్కితిరి

అక్బ—మేము రాజపుత్రకన్యల గొంటిమిగాని, మా కన్నియలను వారికిచ్చుటలేదే?

మెహే—ఎట్లైన నేమి?

అక్బ—రెండు నొకటే?

మెహే—ఆహా-ఒకటే- అదీ వివాహమే - ఇదీ వివాహమే

అక్బ—ఒకటి కాదు నీవు పసిదానవు, రాజనీతి మర్మ మెరుగవు

మెహే—రాజనీతి నెరుగను కాని ధర్మనీతి నెరుగుదును.

అక్బ—ధర్మ నీతి! మెహెర్, పిన్నవయసున దాని నెరుగగల్గితివా? అద నత సహజసరళమా? పృథ్వియం దెన్ని భిన్నధర్మము లున్నవి! ధర్మ మొకటైతే దానియం దిన్ని శాఖ లేర్పడనేల? ఇంతమంది పండితులు, ఇంతమంది విజ్ఞులు, ఇంతమంది మహాత్ములు నున్నారు- కాని ధర్మనీతివిష యమున నిద్దరొక అభిప్రాయము మాపాదింపరు నే నెంతో తర్కము, ఎంతో వ్యాఖ్యానము వింటిని- పార్శీ, క్రైస్తవ, ముసల్మాన్, హిందూ పండితులతో నెంతో ఆలోచించి తిని—వినా ఏమియు నెఱుగలేకుంటిని నీవు బాలికవు—అజ్ఞ రాలవు- అదంతా కరతలామలకము చేసుకొన గల్గితివా?

మెహె—తండ్రి, ఇంత తర్కము, ఇంతయుక్తి, ఇంత అలోచనా అనవసరము-ధర్మ మొకటి- దైవ మొకడు- నీతి యొకటి మానవులు స్వార్థపరాయణులు, అహంకారాక్రాం తులు, లాలసాకలితులు, విద్వేషావిష్టులు అగుటవల్ల ధర్మము నకు వికృతి కల్పించుచున్నారు గగనమంగలి జ్యోతిర్మండలి గాంచుము- దిగంతప్రసారితపారావారము తిలకింపుము- సు ప్రసన్న శ్యామలమగు ధరిత్రిచడుము, అన్నియూ అద్వితీయ మగు నాఉత్కృష్టధర్మమునే బోధించు చున్నవి, దాని పేరే ఈశ్వరుడు మానవులు దానికే పరబ్రహ్మమనియు, అల్లా అని యు, జిహోవా అనియూ, ఏసనియు వేర్వేరు నామములు కల్పించి పరస్పరమూ అవజ్ఞ నప్పుకొంటూ వాదములు పెంచుకొని హింసించుకొనుచున్నారు సత్య మాంసితివేని

సకలజనులును సోదరులు—భిన్నప్రదేశవాసులగుట భిన్నరూప ధారులైరి అట్టివారికి భేదము లెంచకూడదు శక్తసిం హుడు దొంతును మాకవులె, భేదము లేశమును లేదు కావున వారికి వివాహము సమంజసము.

అక్బ—భేదము లేకేమి? మతము భేదము లేదా, ఎదవిని భేదము లేదా దొంతున్ననా భారతసార్వభౌముని భాగినేయి మహమ్మదీయ వనిత, శక్తసింహుడు గృహహీను డు-ప్రతాడితుడు-తుచ్ఛుడగు రసపుత్రుడు- ప్రపీడితుడు- బిచ్చగాడు

మెహె—శక్తసింహుడు మేవారిమహారాణా ప్రతాప సింహుని సోదరుడు-పదవి సమానమే ఆతడు ప్రతాడితు డగుట నిజము నేడూ అక్బరు సార్వభౌముడూ, శక్తుడు ప్రతా డితుడూ, గృహహీనుడు! రే పీయవస్థలు మారునేమో? కాల చక్ర మొకరీతిని కలకాల ముండబోదు-కలిమిలేములు కావడి కుండలు- భాగ్యచక్రపరివర్తనమున కిందివారు మీదికీ, మీది వారు కిందికీ రావచ్చును అక్బరు సార్వభౌముని తండ్రి హుమాయూను, తాత బాబరున్నూ, రాజ్యభ్రష్టులై కొంత కాలము శక్తునివలె గృహహీనులు ప్రతాడితులూ కాలేదా?

అక్బ—శక్తసింహుడు మహమ్మదీయుడైనచో ఈ వివాహము నాకు సమ్మతమై యుండును కాని అతడు నీచు డగు రసపుత్రుడు, కాపురుషుడగు విధర్మి-

మెహె—జనకా! ఇంచుక యోచించి మాటలాడుము

మాటిమాటికి ఉత్తమవంశజులగు రసపుత్రులు నీచులని నిందించుచున్నావు మా అమ్మ-భారతసామ్రాజ్ఞి, నీయర్ధాంగి రసపుత్రకాంత కాదా?

అక్బ— సామ్రాజ్ఞి గా పురుషజాతిలోనిదే, సార్వభౌముడు కాను-ఆమె లెక్క యేమి?

మెహె—అట్లందు వేమి? ఆమె నీ ధర్మపత్ని కాదా?

అక్బ—పత్నియే! అట్టి పత్నులు వందలకొద్ది ఉన్నారు స్త్రీలు పురుషుల ప్రయోజనమునకు విలాసమునకూ అనువగు సామగ్రి జౌదురుకాని సమ్మాన్యవస్తువులు కారు, గౌరవోత్పాదకులు కారు

మెహె—ఆహా! ఎట్టి విపరీతవాక్యము వింటిని! రాజాధిరాజభారతసార్వభౌముడవగు నీనోట రాదగుమాటలా యివి? స్త్రీలు పురుషులకు కేవలవిలాససామగ్రియా? సమ్మాన్య వస్తువులు కారేమి? పురుషు లెవరిగర్భమున జనింతురో అట్టివస్తువు మాననియము కాదందువా? స్త్రీలు మనుష్యులు కారా? వారికి పురుషులకువలె హృదయము లుండవా? అవి సుఖదుఃఖముల ననుభవింప నేరవా? స్త్రీలు కేవల భోగ సామగ్రియా? అట్టి తుచ్ఛసామగ్రి సేకరించుటకు పురుషు లేల అష్టకష్టముల పడుచుందురు? వారి నేల పెండ్లియాడవలె? ఎన్నో తర్కములు, వ్యాఖ్యానములు వింటి నంటివే! దాని పరిణామ మిదా? పురుషుల వివేక మిట్టిదా? ఇట్టి యాదర్శముల పరిగ్రహించిన నీవు హిందువుల గర్హింతువా?

వారి మతమున స్త్రీలోక మెట్లు పరిగణింపబడునో యించుక
విందువా? హిందూశాస్త్రములప్రకారము స్త్రీలుసహధర్మిణులు
పూజనీయలు, గౌరవార్హులు నారీజాతియెచ్చటెచ్చటగౌరవిం
పబడునో, ఆయాచోటుల దేవతలు ప్రసన్నలగుదురని మాఅమ్మ
చెప్పుచుండెను చూచితివా ధర్మవ్యత్యాసము? పురుషులు
స్త్రీల నాటవస్తువులవలె గణింతురంటివి సరే-స్త్రీలుకూడ
పురుషులు విలాససామగ్రియనీ ప్రయోజనపదార్ధములు కాని
మాన్యవస్తువులు కారనీ యెంచగూడదా? వీరికి వారెట్లో
వారికి వీరట్లు కాదా? కాని వారట్లు భావింపరు ఎవరి
హృదయము మహత్తరమో యించుక యోచింపుము
వారు స్వామిసుఖమే తమసుఖమనియు, స్వామికార్యమే
నిజకార్యమనియు భావించి ఆత్మోత్సర్గ మొనరింతురు
అయ్యో! పురుషజాతి యెంత అధ పతితము? మీ రింతనీచులు
ఇంత అధము లని నే నెరుగను మీరు పతితులయ్యు నారీజాతి
దుర్బల మగుట కని దానియెడ నింత అవిచారము, అత్యా
చారము నొనర్తురా? లాలసాకలితఘృణచే ప్రకృతిదుర్వహ
ములగు స్త్రీజీవితములు నిర్భరములుగ చేస్తున్నారా?
అక్కటా! ఏమి దౌరాత్మ్యము!

అక్బ—మెహెర్, నీతో శాస్త్రచర్చ చేయనొల్లను
నీయభిప్రాయము లక్ష్యము చేయను నా కూతురునం దిట్టి
యుద్ధత, వక్తృత, ఇట్టి అసహనీయ స్పర్థ, ఇట్టి పితృద్రోహ
మును సైపజాలను నీకును సలీమునకును నోరు మెదపక

నాయాజ్ఞలు పాలించుటయే విధి- తెలిసినదా? తగిన్య మాచ
రించిన ప్రమాణము తప్పదు (వెళ్ళును)

మెహె—సార్వభౌమా! నావిధి నే నెరుంగుదును
నా తల్లిని, ఏ పత్నిని, భారతసామ్రాజ్ఞిని, బానిసెఅనీ ప్రయో
జనమునకూ విలాసమునకూ భాజనమగు మట్టిబొమ్మ అని
అవమానించిన తండ్రిపజ్జ నుండుటకంటె ఆతని పరిత్యజించుటే
శ్రేయము— ఆతడు ఢిల్లీశ్వరుడు కానీ జగదీశ్వరుడు
కానీ జీవచ్ఛవమగు దారిద్ర్యమా! రమ్ము ప్రచండఝంఝా
మారుతమా, నన్నెక్కడకైని ఎగురగొట్టుము జనశూన్య
నిబిడారణ్యములారా! నన్ను మాకోడము జేర్చుడు దుర్గమ
పర్వతరాజములారా, మీ గుహలలోనికి నన్ను గొనుడు
నేను సార్వభౌముని కూతురను కాను దారిబోయెడు
బికారిని- ఇట్టి యువరాజ్ఞి నగుటకంటే అట్టి దాన నగుటయే
మేలు. ఇలాతలమున నా కిరవు లభింపకుండునా? ఇదే తెర
లెదని. (పోవును)

—•పదవ రంగము•—

ఉదయపుర పర్వతగుహలో ప్రతాపుడు

ప్రతా—కోమలమీరు వీగితిని, సర్వదుర్గములూ శత్రు
హ స్తగతములయినవి ఉదయపురము మహోబత్ వశ
మయ్యెను అంతా కోలుపోతిని భాగ్యచక్రపరివర్తన మను

కూలించెనా? వీటిని తిరుగ పొందవచ్చునను నాశ యుండు టచే ఆవిషయమున చింత లేదు కాని, మానా, రోహి దాసూ! మిమ్ము తిరిగీ మాచు భాగ్యము లేదు కదా! ఈ దు ఖవార్ధి నెట్లు తరింతును? ఈవుట్టువున ఇంక మిమ్ము మాడజాలను కదా? అదృష్టహీనుడను నా దౌర్భాగ్యము మిమ్మందరిని చుట్టుముట్టినది (ఇరానచ్చును) అమ్మా, పథ్య ము పుచ్చుకొన్నావా?

ఇర—నా భోజన మైనది జనకా! ఇదెచ్చోటు?

ప్రతా—ఉదయపుర ప్రాంతారణ్యము

ఇర—కమనీయమైన చోటు పర్వతములు ధూమ్రము ములు, శుష్కములునై కనబడుచున్నవి

ప్రతా—అమ్మా, నీవు శయనింపుము రాజపుత్రుని జీవన మిట్టిదే నాల్గుదినములనుండి ఆహారము లేదు, నేడు కందమూలఫలభక్షణము, కఠోరప్రస్తరావృతశయ్యా దేశము కొఱకు పాటుపడునప్పుడు ఆకో, అలమో, దుంపయో, ధూళియో, తినవలెను, అదే అమృతమగును, ఈలోకమే స్వర్గము తల్లికొరకు తల్లడిల్లునపుడు గులకరాళ్ళసెజ్జయే తత హంసతూలికా తల్పమగును (మాహూ వచ్చును) ఏమి మాహూ! ఇట్లువచ్చితివి?

మాహూ—మీచరణసేవజేసి మిమ్ము నర్చించి పోవుద మని వచ్చితిని

ప్రతా—నీ భక్తికి సంతసించితిని

ఇరా—మాహూ! నీకు కుశలమా?

మాహు—అమ్మా! అంత చిక్కియుంటి వేమి? పరుంటివే?

ప్రతా—ఆమె చిక్కుట అరుదా? జీవములో నున్నది అదే చాలు-మొదటనే రోగిణి, బలహీన-ఆపై భోగముల మాట అటుంచు, కడుపునిండా కూడు కంటినిండా నిద్ర లేవు ఇన్నాళ్ళకు నేటికి రెండురొట్టెలు చిక్కినవి ఇట్టి వెన్నాళ్ళు గడుపవలయునో తెలియదు

మాహు—అమ్మో! ఏమి రోగము! అమ్మను జాగ్రత్త!

ప్రతా—ఏమి చేయుమందువు మాహూ? బిటూ రడవులందు భోజనము చేయ గడంగినతోడనే ఐదువేల మొగల సైనికులు హఠాత్తుగా మమ్ముచుట్టవేసిరి-ఇర్వారుగురు భటులతో వారిని తప్పించుకొని కాలినడకను పదికోసుల దూరము పరుగుపరుగున వచ్చితిమి

మాహు—మఱచితిని వార్తయొకటి తెలుపవలసి యున్నది

ప్రతా—అదేమి?

మాహు—ఫరీదుఖాను సిపాయిలంపియూ రాయ గడమున కేగిరి వేయిమంది మాత్రమే యిప్పుడున్నారు

ప్రతా—ఎక్కడ?

మాహు—ఇక్కడ కెంతో దూరముండదు నేడు

సేనాధిపతి పుట్టిన దినపుని అందరు నుత్సవములలో మగ్నులై యుందురు అప్పుడు వారిపై బడుదము.

ప్రతా—నాయొద్ద నూర్గురకన్న నెక్కువ సేన లేదే?

మాహు—నాయొద్ద వేయిమంది భిల్లు లున్నారు వారు మీకై ప్రాణములు విడుటకుకూడా సంసిద్ధులు

ప్రతా—అట్లయిన వారిపై బడుదాము, తినుబడి రస్తైన దొరకును-మీవారిని సిద్ధముగా నుంచుము ఈరాత్రే పోదాము

మాహు—చిత్తము-అమ్మగారి దేహస్థితి బాగా లేదు- జాగ్రత్తతో కాపాడండి (పోవును)

ప్రతా—ఆహా! మాహూ! నీబోటిబంధు వీజగమున దుర్లభుడు, నా కష్టదినములయందు భిల్లసైన్యముతో నాపాలి దైవమువలె సాయపడితివి ధన్యుడవు!

ఇర—తండ్రీ!

ప్రతా—ఏమమ్మా?

ఇర—ఇంకా యుద్ధమేనా? ప్రపంచమందలి సర్వజీవులను సోదరులవలె ప్రేమించవలయును కాని పరస్పరదుఃఖ హేతువగు విద్వేషమును పెంచుకొననేల? ఎంతోకాల ముండువారము కాము-ఈనాల్గుదినములూ ఏకోదరులవలె పరస్పర స్నేహము పెంచుకొనగూడదా?

ప్రతా—అమ్మా! అందరూ అన్యోన్యము ప్రేమించు

కొనుచూ కాలము గడపనెంచినచో ఈలోకము స్వర్గమే అగును

ఇర—జనకా! స్వర్గమెచ్చట నున్నది? అంబరవీథినా? లేదులేదు ఏనాడీలోకమున పరోపకారము, అన్యోన్యప్రీతి, భక్తియు విరాజమానము లగునో, ఏనాడు అసీమప్రేమజ్యోతి అంతటా వ్యాపించునో, ఏనాడు జనులు స్వార్ధపరత్వమువీడి పరోపకారమునకై పాటుపడుదురో, ఆనాడు ఇతరుల శ్రేయమే తన శ్రేయమగును, స్వార్ధపరార్థము లొండొంట లీనమగును అప్పుడీలోకమే స్వర్గమగును

ప్రతా—అట్టిదిన మతిదూరమున నున్నదమ్మా

ఇర—కానిండు-మనము జీవనము యుక్తరీతిని నల్పుచూ ఆ దినము దరికి పోకుండా రక్తప్రవాహముల కొట్టుకొనిపోవుచు వెనుక బడనేల?

(యువకుని వెంటబెట్టుకొని అమరసింహుడు వచ్చును)

ప్రతా—అమరా! ఈతడెవడు?

అమ—మానసింహుని అనుచరులలో నొకడనని తానే చెప్పుచున్నాడు కాని నాకు నమ్మకము లేక మీకడకు దెచ్చితిని

ప్రతా—సరే-నీ విక వెళ్ళుము యువకుడా, నీ వెవడవు? నిజము చెప్పు

మెహె—మీరు రాణాప్రతాపసింహులా? ఈ కుటీరమా మీ నిలయము? ఈ ఫలములా మీ భక్ష్యభోజ్య

ములు? ఈ తృణములా మీకు శయ్య?

ప్రతా—అవును-నేనే ప్రతాపుడు, నీ వెవడవు? నిజము చెప్పుము!

యువ—అసత్య మాడను, కాని నిజము చెప్పుటకు జంకిగుచున్నది-నాకథ విన్నపిదప నన్నాదరింప వీలుపడదు మీకు

ప్రతా—ఏమి? నిన్నేల వినవను?

మెహె—ప్రభూ! మీరు రాజపుత్రకులదీపకులు, మా నవజాతికి గౌరవాపాదకులు, మీగురించి నేనెన్నియో కథలు వింటిని, కొన్నింటి నమ్మితిని, కొన్నింటిని నమ్మలేదు నేను మిమ్ము ప్రత్యక్షముగా దర్శింప నా సందియములు బాసెను మీవ్యక్తి అత్యద్భుతము, కల్పనాతీతమహిమోపేతము-దేశమునకై యిట్టి దైన్యగ్రహణమా? ఒకసారి వశ్యతాస్వీకార మొనర్చినచో సార్వభౌముని యర్ధాసనమున నుండి తత్తుల్యగౌరవభోగముల నందుచూ, పరిషద్గణశేఖరులై వారికి కుడిభుజముగ నుందురు అట్టి తరుణమును తలదన్ని ఇట్టి నికృష్టదశాపాతమును కోరి తెచ్చుకొంటిరి ఇది విని మీమహత్త్వమును స్వయముగా కనవలెనని ఇక్కడికి వచ్చితిని మహారాణా! నాదేహమున కొంత రసపుత్రరక్తము ప్రవహించుచున్నది నేను మీయెదుట నబద్ధ మాడజాలను, మానసింహుని అనుచరుడ గాను-ఏమని చెప్పుదును? మిమ్ము గాంచినతోడనే నామనమున భక్తివిస్మయవిశ్వాసానందములు వెల్లువలై పారుచుండుటచేత నోరాడకున్నది

ప్రతా—చిత్రముగా నున్నది నీ చరితము! నాయెడ సానుభూతి పుట్టుటకు నీవెవడవు?

మెహ—నేను పురుషుడను కాను

ప్రతా—ఏమీ! నీవు స్త్రీవా? ఈ వేషమేల? ఇచ్చటికి వచ్చిన పనేమి?

మెహ—మీరు నన్ను విశ్వసించినచో ప్రకృతమున మీకుటుంబము నకు సేవజేయవలెనని వచ్చితిని, నా యాగమమునకు ప్రకృష్టకారణ మింకొకటి కలదు

ప్రతా—బాలామణీ! నీపేరు?

మెహ—అబలపేరు తెలియవలసిన మీ కేమి ప్రయోజనము?

ప్రతా—పోనీ, నీ తండ్రిపేరు చెప్పుము

మెహ—నాతండ్రి మీ శత్రుకోటిలోనివాడు, నేను మీ ఆశ్రయము నపేక్షించి వచ్చితిని విన్నవెనుక నన్ను పరిత్యజించనని మీరు శపథజేస్తే నాతండ్రిపేరు చెప్పెదను

ప్రతా—నేను సుక్షత్రియుడను, క్షత్రియు లార్తత్రాణ పరాయణులూ, శరణాగతరక్షణబిరుదాంకితులూఅని లోకమెరుగును, నీ తండ్రిపేరు చెప్పుము

మెహ—నా తండ్రి—

ప్రతా—జంకవద్దు-చెప్పుము

మెహ—నాతండ్రి—మీకు గర్భశత్రువగు అక్బరుషా!

ప్రతా—నిజమా? లేక మోసమా?

మెహె—నా జన్మమధ్యమున మోసగించుట నేను నేర్చుకొనలేదు

ప్రతా—అక్బరుసార్వభౌముని కూతురు నా కోరమునకు ఎందుకు రావలెను? ఇది సంభవమా?

మెహె—నేను సత్యమే పల్కుచున్నాను ఇల్లు విడిచి వచ్చితిని

ప్రతా—ఎందుచేత?

మెహె—విస్తరించి చెప్పమందురా?

ఇర—ఈమె ధ్వనిసవ్వడి నేను విన్నట్లున్నది మెహెరున్నిసా!

మెహె—ఇరాదేవీ, జ్ఞప్తి యున్నదా?

ఇర—తండ్రీ, ఈమె అక్బరుషా కూతురే.

ప్రతా—అమ్మా, నీ వీమె నెక్కడ చూచితివి?

ఇర—హల్దిఘాటి యుద్ధక్షేత్రమున చూచితిని

ప్రతా—మెహెరున్నిసా, నీవు నా శాత్రవుని కూతురవై నా మరువు జొచ్చితివి నీకు శరణ మిచ్చుసామర్థ్యము ఇప్పుడు నాకు లేదు నేనే నిరాశ్రయుడను-అయినను నిన్ను మాత్రము పరిత్యజింపను అమ్మా! లోనికి పోయి లక్ష్మి యొద్ద నుండుము ( తెరజారును )

---




# నాలవ అంకము

## —మొదటి రంగము—

[ఘన్సిగార్ దుర్గమున శక్తసింహుఁడు]

శక్త—సలీమ్ నే నిన్ని దినములనుండీ యీదుర్గమున ఊరక కూర్చున్నానని ఎంచకు-ని పదాఘాతమును నేను మరువలేదు అగ్రానుండి వచ్చిన కొద్ది దినములలో రాజ పుత్రసైన్యమును సమకూర్చి యీకోట నాక్రమించితిని, కాని నిశ్చింతుడనై యుండక ప్రతిహింసకు తగినయదను వెదకు చున్నాను-ఇందు నిరీహులగు కొంద రనాథుల జంపవలసి వచ్చెను, ఇంకెన్ని హత్యలు చేయవలయునో! ఇం దన్యాయ మేది? శ్రీరామచంద్రుడు సీత నుద్ధరించుటకు వేలకొలది నిరప రాధులు, స్వదేశవత్సలులు, రాజభక్తులు నగు రాక్షసుల జంపలేదా? అది అన్యాయ మందురా? నేను చేసినపని అట్టిదే (దూత వచ్చును) ఏమి వార్తలు?

దూత—రాణావారు బిటూరువనమం దున్నారు మానసింహుడు కోమలమీరును కాల్చుట నిజము

శక్త—సరే- రేపు బయలు దేరవలెనని సైనికుల హెచ్చరింపుము ఈయప్పు తీర్చెదనులే, మానసింహా! (దౌలతు వచ్చును) ఏమి కావలయును?

దౌల—చల్లని నిడ

శక్త—శీతల ఛాయయా? ఇంకేమైన కావలసిన-చో చెప్పు

దౌల—నాథా!

శక్త—ఆ! నాథా! ఆపైన? సరేకాని, మట్టమధ్యాహ్నమున! నాథా! ప్రాణేశ్వరా! అని పిలుచుటకా వచ్చితివి ఇప్పు డట్టిమాటలు శోభాకరములు కావు ప్రణయ ప్రబంధమున ప్రథమాశ్వాసమున నివి క్రమాదిరిగా చెల్లుబడి యగును ఒక వత్సరము గడచిన వెనుక పట్టపగలు, మట్ట మధ్యాహ్నమున ఇట్టి సంబోధనలు పెనముపై వేచిన వంకాయ ముక్కలవలె నుండును

దౌల—నాథా! పురుషుల ప్రేమ యెట్టిదో నే నెరుగను, కాని స్త్రీల ప్రేమయం దీమాట లెన్నినాళ్లైనను సమరసముగానే ఉండును

శక్త—అనగా, పురుషుని లాలన తృప్తిచెందును కాని స్త్రీలాలన తృప్తిచెంద దన్నమాట-అంతేనా?

దౌల—భార్యాభర్తల సంబంధము లాలన అని మీ అభిప్రాయమా?

శక్త—స్త్రీపురుషుల సంబంధ మిట్టిదే పురోహితుడు

రెండుపూర్ణానుస్వారములూ రెండువిసర్గలూ చేర్చి మంత్రములు చదివినంత మాత్రమున ఆసంబంధి మెక్కువ సాంద్ర మగునా? మన కట్టి వైభవము కూడా జరుగలేదే సంఘనియమముల బట్టి నీవు నాకు భార్యవు కావలెవు-ప్రణాయి వగుదువు

కాల—ప్రభూ!

శక్త—లోనికి బొమ్ము--సుందర్యధరమధుపానము కంటె సుధామయోక్తిశ్రవణముకంటే భిన్నములగు కార్యములు పురుషుల కుండును (ఆమె పోవును) స్త్రీజాతి యన నింతే! అంతా సారహీనము, కను నసహ్యము పురుషుల లాలసాదశయందు మాత్రము వీరు సుందరులుగా దోచుచుందురు స్త్రీలే కాదు పురుషులు మాత్రము? అధను మృగములు-నగ్నుడగు నరునికంటె సుందరతరముగాని జంతు వున్నదా? మానవజాతి ఎంత హేయమైనది? స్వీయ దేహపుష్టికై సుందర సుస్వాదు సుగంధ వస్తుచయము సేకరింపనిచో మానుషశరీర మెంత కశ్మలసంకులము! చేయు కర్మ ఎంత బీభత్సము! ఆపాదమస్తకమూ దుర్గంధదూషితమే! ప్రాణము కాస్తా పోతే రెండుగడియ లుంచకూడదు అది యున్నంత వరకే సౌరభము, రక్తి! అంతవఱకే భోగభాగ్యగౌరవములు (దుర్గాధ్యక్షుడు వచ్చును)

దుర్గా—ప్రభూ! రేపు ప్రయాణమా?

శక్త—అవును, ప్రాతఃకాలముననే ఈ సహస్ర సైన్యము నీయధీనమున నుంచుము, చాల తిటకున్నదని ఎవరికీ తెలి

యగూడదు నీవు పొమ్ము-సలీమ్, అక్బర్, మొగలసామ్రా జ్యమా? మిమ్మందరినీ కాలితో నలిపి చూర్ణముచేసి నిష్ప్రిష్ట ము చేసెదను (పోవును)

---

## — రెండవ రంగము —

---

(ఖుష్రోజుమేలాలో జోశీబాయి అక్బరు)

అక్బ—సుందరీ, నీ వేమి వెదకుచున్నావు?

జోశి—త్రోవ తప్పితిని-దయచేసి త్రోవచూపండి సార్వభౌమా!

అక్బ—నేను సార్వభౌముడనని ఎట్లెరింగితివి?

జోశి—ఈ మేలాలో మీరుతప్ప వేరు పురుషు లుండరని వింటిని

అక్బ—నీ వెవతెవు?

జోశి—రాజకవి పృథ్వీసింహుని భార్యను-మేవార కన్యను, నాపేరు జోశీబాయి

అక్బ—అటులనా? నీ వీమేలాకు వచ్చుట కిదే తొలిసారి కాబోలు?

జోశి—చిత్తము ఈచోటు నా కపరిచితము, దయ చేసి త్రోవచూపితిరా-

అక్బ—సుందరీ-ఈచోటు ప్రవేశించు మార్గము సుగమము, పోవు మార్గము దుర్గమము ఒకవేళ నీవు—

జోశి—నాకు త్రోవజూపుడు- ఇదేనా త్రోవ ఇంటికి పోవుటకు? (పోబోవును)

అక్బ—(అడ్డువచ్చి) ఇంతవరకు వచ్చినదానవు నాపై కరుణించి నా అభ్యంతర కక్షమునకు దయచేయుము-రమ్మ్మ, పోవుదము

జోశి—దారి చూపుడు, నా కడ్డము లెంపు, నేను పోయెదను

అక్బ—సుందరీ, నీవు చిన్నదానవు, బేలవు- అక్బరు సార్వభౌముడు సుందరీపక్షపాతియని యెరుగవు కాబోలు? రా, రమ్మ్మ

జోశి—ఈ వాగ్జికమేలా మీపాపలిప్స కచరితార్థము చేయుసాధనమనీ నే నెరుగుదును చిన్నదాననైనను అక్బరు పరస్వాపహారణమున నెట్టి శూరుడో, స్త్రీమానహారణమున కూడా అట్టి వీరుడని ఎరుగుదును. కాని తనయింటికి కులీనలగు నారీమణులరప్పించి వారి నవమానము చేయుటకుజంకని సిగ్గిడి అని నే నను కొనలేదు దారి విడువుడు. నాతో మీకు వాదమేల?

అక్బ—నిన్ను రాణివలె సర్వాలంకార భూషితను చేసి పంపెదను

జోసి—హా, దైవమా, ఎట్టిమాట వినవలసి వచ్చెను.

అక్బ—నా సామ్రాజ్యమున చక్క-నిఖండ మొకటి యిచ్చెదను,

జోశి—మేవారు రాజపుత్రస్త్రీలు ధనలుబ్ధలు కారు నీ సామ్రాజ్యమును నీ వర్పింపనున్న సఁ సార్వభౌమా! నా శీలమును నేను వీడను- దారిలో లెమ్మ

అక్బ—సుందరీ, నీ రోషరంజిత వదనమండల మనమ లోభనీయము రమ్మ ఈవిషయ మెవ్వరికీ తెలియబోదు, ఇంకోసారి నిన్ను నిర్బంధము చేయనని బాసచేసెదను. రమ్మ జాలమేల? (చేయి బట్టుకొనును) దీనిమూలమున నీగౌరవము హెచ్చును కాని తగ్గదు రమ్మ, పోదము.

జోశి—(ఛురికతీసి) అధమా! కాపురుషా! లంపటుడా! నేను మేవారరసపుత్రకాంతను కులాంగారులగు కొందరు రాజులు నీచము, పాశవము పైశాచికము నగు నీఖుస్రోజుమేలాయందు తమకాంతల మానము అమ్మి, కులము చెరచుకొని, నీకు దాసులై నీ మదలాలసను హెచ్చించినారు వారు రాజపుత్రులూ కారు, హిందువులూ కారు, వారు క్షాత్రధర్మమే కాక మానవధర్మము కూడా కోలువోయి, పతిపత్నీ నియమము లేని నరులు, పశువులకన్న అధములు నీవు సార్వభౌముడవు, నీప్రజలకు తండ్రివంటివాడవు గొప్పయింటి గోలయెడ నిట్టి దుశ్చరితమునకును దురాచారమునకు నొడిగట్టుచున్నావు ఇది నీకు తగునా? తుచ్ఛుడా! దారి వీడుము, లేకున్న చూచితివా దీనిని? నీప్రాణము లుండజాలవు సుమా

అక్బ—వీరనారీ, కోపము వలదు నీ వీదారిని పొమ్ము

నై సర్గికముగా సతీత్వమర్యాద నెరుగనివాడ గాను, ఇష్టము లేనివారి శీలమును కళంకితము చేయును మహాత్త్వము నాకు లేకున్నను మహాత్వతత్త్వ మెఱుంగుదును. నిన్ను బైటవిడిచి వచ్చెదను రమ్మా (పోవుదురు)

---

## —నాల్గవ రంగము—

---

(కుటీరమున ఇర పరుండ మెహెర్ ప్రక్కను కూర్చుండును)

ఇర—మెహెర్!

మెహె—ఏమమ్మా?

ఇర—అమ్మగారు కంటనీరు పెట్టుకొని వెళ్లినారు, కారణమేమి? నేను జీవింపననియా?

మెహె—అందుకు గాదు నీ వట్లనుకొనగూడదు

ఇర—ఏల యనగూడదు? పృథ్వియందు మృత్యువు కన్న సత్యమైన విషయ మున్నదా? మనము నిన్న మొన్నటివారము, కాని మరణ మనాదినుండియు నున్నది మరణసముద్రమున జీవితకాల మొకవీచికవలె లేచి, కొంతకాలము నిల్చి పిదప నశించును తిరుగ నిశ్చలమగు సముద్రము నిల్చును. జీవితము మాయవలె క్షణికము కాని మృత్యువు ధృవము, నిత్యము చిరకాలమునుండి అనుభవించుచున్న స్వప్నమువలె జీవితము వచ్చిపోవుచుండును

మెహె—నిజము

ఇర—నీవు మొగలకన్యవు, నేను రాజక్షత్రకన్యను నీ తండ్రియూ నా తండ్రియూ బద్ధవైరు లగుటచే పరస్పర ముఖావలోకనము పరమపాతకముగ నెంచుచున్నారు నీవు నాకు తోబుట్టువువలె మెలగుచున్నావు ఈ సౌహృద మీనాటిది కాదు, పూర్వజన్మసంచితమై యుండనోపు మనకు మైత్రిఘటిల్లిన సమయము నీకు జ్ఞప్తియందున్నదా ?

మెహ—లేకేమి? ఆనాడు హల్దిఘాటీ సమరక్షేత్రమున మీ పినతండ్రిగారి శిబిరమున నొకటిరెండు మాటలాడుకొంటిమి! పిమ్మట కొన్ని క్షణములలో నిన్ను చూతమని వచ్చునరికి నీవక్కడనుండి వెడలితివి

ఇర—నేను నిన్నెన్నోసారులుస్వప్నమందు గాంచితిని అట్టి కలలు క్షణభంగురము లయినను అత్యంతమధురముగ నుండెను తిరుగమనకు సమావేశ మగునని నాకుండెను ఇప్పటికైనది ఇకముందు కాగలదు ప్రేమ అనునది శాశ్వత పదార్థము సుమా

మెహె—మఱల మనకు సమావేశ మెచట కాగలదు?

ఇర—[పైకి చూపి] అక్కడ ఆచోటు నీ కగపడ లేదు కాబోలు అందుకు హేతు వెరుగుదువా? నీ కన్నులు ఐహికతీవ్రాలోకపరిచ్ఛిన్నములై యున్నవి-నేను చెప్పెడు చోటు దానివెనుక దాగియున్నది ఆకాంతి దీనికంటె భాస్వరము సూర్యుని తీక్ష్ణకాంతి అనంతకోటి నక్షత్రకాం

తుల కప్పివుచ్చుబ లేదా? సూర్యకాంతి సన్నగిల్లినపిమ్మట రాత్రులయందు తారాజ్యోతిస్సముదాయ మాకసమునందు దోచుటలేదా? అట్లే జీవులు ఐహికజ్యోతిర్మగ్నులై యున్న వేళల స్వర్గజ్యోతిని చూడజాలరు, అది నశించినవెనుక నిది గోచరమగును. ఆహా! స్వర్జ్యోతి ఎంత ప్రకాశమానము! ఎంత సుందరము! హాయిహాయి!

మహే—ఇరా, నిద్రపోవా?

ఇర—ఆకసమువంక జూడుము ఎంత నీలము, ఎంత గాఢము, ఎంత సుందరముగా నున్నదో, సూర్యు డస్త మించెను పగలంతయు తప్తతపనీయకాంతిని పృథ్వినెల్ల ముంచెను అది నదీప్రవాహమువలె క్రమముగా క్షీణించెను ఆకసమందలి రంజితమేఘమాలను జూడుము క్షణములో నదియు మాసిపోవును ఇవన్నీ క్షణభంగురములు కావున భ్రాంతికి హేతువులు

మహే—ఎందుచేత?

ఇర—ఇవి తెరపై రంగులు, నిజమైన వస్తువునకు ప్రతిచ్ఛవిమాత్రములు-చూడదగిన దీతెరలు కాదు, వీటికి వెన్క సుందరదృశ్యము లమర్చబడి యుండును ఈ సూర్యునకును, ఈ యాకాశమునకును వెన్క నవి యున్నవి ఇహమను తెర వాటి నాచ్ఛాదించి యున్నది ఐహికచింతలు దొలంగినవెన్క నది గోచరమగును సత్యమన్నను, నిత్యమన్నను, సుందరమన్నను, శివమన్న నదియే నాకు నిద్ర

వచ్చుచున్నది (ప్రతాపుడు వచ్చుచు)

ప్రతా—అమ్మా, మెహెర్, ఇం నిద్రించెనా?

మెహె—ఇప్పుడే శయనించినది

ప్రతా—నీవు పోయి విశ్రమింపుము, నే నిట నుండెదను.

మేహె—వలదు నే నందును మీకు పగలంతయు విశ్రాంతి లేదు కావున మీరే శయనింపుడు

ప్రతా—నా కిప్పుడు నిద్దుర రాలేదు వచ్చేటప్పుడు నిన్ను పిలిచెదను, పొమ్మా ఇనుమును బట్టి అగ్నికి సమ్మెట పెట్టు లన్నట్లు మాతో గూడియుండుటచేత ఆగర్భశ్రీమంతు రాలును, సహజసుకుమారియు నగు ఈమెకూడ అష్టకష్ట ముల బడుచున్నది అయ్యో! నే నెంత కష్టజీవిని! మూడు దినముల నుండి వనముల ద్రిమ్మరుచు మొగలసైన్యము బారి నుండి తప్పి బయట పడితిని తిండిలేదు, నిద్రలేదు అందు కవకాశ మేది? అంతపై రుగ్ణకన్య, ఒంటిపూట భుజించి స్రుక్కియున్న సుతులు, శ్రాంత యగు సతీమణి—వీరితో నిచ్చట జేరితిని నిన్న మొగలులచే బందీకృతుడను కావలసి నదే, కాని విశ్వసనీయుడగు భిల్లసరదారు అనుగ్రహమున ఆముప్పు తప్పినది, కాని పాప మాతడు మరణించెను, ఆతని భార్య అనాథ, పిల్లపాపలు నిరాశ్రయులైరి ఇదంతయు నా మూలముననే కదా? ఇటులనే నా ప్రాణరక్షణార్థ మెందరి ప్రాణములో నశించినవి ఇక నాప్రతిన నెరవేరునని తోచదు.

నిల్వకొనజాలు ధైర్యమూ నశించుచున్నది నాజీవితము నిర్భర మగుచున్నది భార్యయు బిడ్డలును బాముల ఒడు చుండ జూచి ప్రాణముల భరింపగలనా? నక్కలవలె ఒకవనము నుండి వేరొకవనమున కెంతకాలము పొంచిపొంచి పరు గెత్తగలము? కడుపునిండా కూడు, కంటినిండా కూర్కు లేదాయె- పోనిమ్ము తల దాచుకొనుటకైనను తావులేదు ఇట్టి కష్టము లెన్నియైన నేను సహింపగలను, కాని దుర్బలు లగు వీ రెట్లోర్తురు? పురుషులు సహాజకిరినులు, ఐనను వారి సహనశక్తికికూడా మేర ఉన్నది అపూర్యంపశ్యాయగు నర్ధాంగీ, సహాజసుకుమారమగు సంతానమూ సకలబాధల సహించు చుండ వీరి దు ఖమును చూచి నే నెట్లోర్వగలను? దుర్భ రము! నిర్భరము!

ఇర—అమ్మా!

ప్రతా—ఎందు కమ్మా?

ఇర—ఎంత సుందర మెంత సుందరము! చూడు చూడు

ప్రతా—ఏదమ్మా?

ఇర—అదిగో ఆనందవారాశి ఎందరో జీవన్ముక్తులు దాని నీదుకొని పోవుచున్నారు—అత్యంత సౌందర్యమయా లోకఖండములు కొన్ని మినుకుమినుకు లాడుచున్నవి— ఆకాశమునుండి మధురసంగీతము అశ్రాంతధారాపాతముగ వర్షించుచున్నది చింత మూర్తిమయము, కామనవర్ణమయ

ము, ఇచ్చ ఆనందమయము.

ప్రతా—ఇది స్వప్నమో, లేక అపస్మారమో, నన్ని పాతము కాజాలు.

ఇర—అయ్యో ! విరిసినది. నే నెక్కడ నున్నాను ?

ప్రతా—నాదగ్గర నున్నావు ఈ బాలిక జీవించు నట్లు తోపదు గోరుచుట్టుపై రోకలిపోటు హా! దైవమా! అన్నికష్టముల నలయుటకు నీకు నేనా దొరికితిని ? హల్దిఘాటీ క్షేత్రమున నాకు బాసటైనిలిచిన రసపుత్రవీరు లెందరో హతులైరి నా సన్నిహితబంధు లర్ధసహస్రము, రామసాదశము మూడువందలేబది, మానా సైనికులు నూటయాభై మంది, మొత్తముపై మేవారు కుటుంబములలో అధమ మొకనినైన నాయుద్యమమునకు బలియొసగనిది లేదు ప్రతి ఫలము పూజ్యమయ్యెను ఈవర్షాగమ మొక్కింత శాంతి నొసంగెను, లేకున్న మా దేశమందలి వీరులందరీపాటి నశించి యుందురు వసంతాగమమున మరల అపజయము ప్రాప్తింప దొడగెను మానసింహుడూ మహోబతుసూ రసపుత్రవీర కులమునకు ధూమకేతువులైరి అన్నిదిక్కులూ అరు లాక్ర మించి యున్నారు గుప్తమర్గముల నన్నిటిని గాల్చి, వనము నుండి వనమునకు మమ్ము తరుముచున్నారు గిరిదుర్గములలో జేరి మొగలుల నెన్నోసారులు సిలుగుల బెట్టితిని నానా టికి నాబలము కృష్ణపక్షచంద్రునివోలె క్షీణించుచుండ, నా కష్టములు శుక్లపక్షచంద్రునిలీల వృద్ధినొందుచున్నవి సార్వ

భామునితోడి సమరము సామాన్యమా? ఏమిచేయవగును! దేశమున, రాజ్యమున, నన్ను, ఎన్నికష్టములు కారియవెట్టిన నోర్చితిని ఇప్పుడు నాకుటుంబమువంతు వచ్చినది శత్రువుల బారి నేను పడిన నోర్వగలను గాని నాకుటుంబము నట్టి దుర్దశయందు దోయగలనా? ఇదివర కొకసారి ఆముప్పు తప్పు టకు భిల్లులు వారిని బుట్టలలో బెట్టి గనులలో దాచిరి చెట్టు లకు గట్టిన ఆకుబుట్టలే నా నిసువులకు క్రొంబసిడి ఉయ్యాల లయ్యెను. భోగముల కేమి? అన్నపానము లరుదయ్యెనే! అయిదు సారులు భోజనమునకు గడంగి అడు లరికట్టుచే అన్నమువీడి పరుగెత్తితిమి నేను పిల్లల కొకొక్కరొట్టె దొరికెనదని సంతసించుచుండ మా తర్వాత–పిల్లల రొట్టెను పిల్లి లెత్తుకొని పోయెను. అందఱూ అన్నా మా రామచంద్రా అని అరచుచుండుట విని నే నెట్లోర్వగలను? పౌరుషము సాగు సంతవఱకు పాకులాడితిని, విధిప్రతికూలమైనచో వీరు డేమి చేయగలడు? ఆత్మబంధువుల కన్నమిడజాలని అప్రయోజకు నకు రాజనామమేల? ఆర్తులరక్షింపలేని అనద కన్యధర్మ చింతయేల? భార్యను బిడ్డలను పోషింపలేని వానికి పట్టువల యేల? ఆత్మగౌరవము నిల్పుకొనజాలనినాడు ఆగ్రహమేల? స్వీయమానము నిల్పుకొనలేనివేళ స్వేచ్ఛయేల? శాంభవీ! శపథము నిల్పజాలను, అక్బరు ననుగ్రహాభిక్ష యాచించి అంద రికీ సుఖము చేకూర్తును

ఇక— మెహెర్!

మెహె—ఇదే వచ్చితిని.

ఇర—అక్కా! ఇప్పుడు నన్నువిడచి పోతివా? నేను పోవుచున్నాను నీతో రెండుమాటలు చెప్పవలసియున్నది

మెహె—అమ్మా! అధైర్యపడకు

ఇర—కాదక్కా, నేను పోవలయును మీ కీసంగతి తెలియుదేమో, నాకు పోకతీఱదు నీతో నేను చెప్పదలచిన దానిని సావధానవై వినుము నాన్నగారి శరీర మస్వస్థతమై నది అందుచే వ్యర్థమైన యుద్ధమునకు వారి నుత్తేజింపకండి అందఱికీ కష్టములు నిష్ఫలములమ్యెను తండ్రీ! యుద్ధము చాలింపగూడదా? మానవునకు సాధ్యమయినంతవఱ్టు సాగి తిమి సార్వభౌముడు మానవధర్మము వీడి చిత్తూరుగొని సుఖింపదలచినచో అట్లే కానిండు అతనితో పోరజూమట వృథారక్తపాతమే కాని ఫలముండదు అతను చిత్తూరు కోరిన నిచ్చివేయుడు, ఇంకేది కావలెనన్న దాని నొసగుడు మన రాజ్యమంతయు గొననిండు ఇట్లెంతకాలము కష్టములు పడగలరు? జనకా, నేను నేను, రేపు అమ్మ, తరువాత మీరూ పోకతీరదు కదా? ఈయూరాటము మానితే శ్రాంతి చెకూడనేమో? నాకు కాలము సమీపించినది ఇంకొక్కటి చెప్పెదను- మీయొద్ద నీమెహెరునుంచి పోవుచున్నాను నాకు మారుగ నామెను మీకూతురిగ భావించుకొనుడు ఆహా! అహఃకాలమున నామె యిట చేరినది, లేకున్న నాపేరుగ మీయొద్ద నుండుట కెవరున్నారు? మెహెర్, నీవు నేను నెట్టి

బంధువుల మైత్రిమో అట్లే మనజనకులు మిత్రులగునట్లు కావింపుము నీకది శక్యమైనచో ఆర్యావర్తముపై శాంతి వారి చల్లినదాన వగుదువు దీని మరువకు, నన్ను మఱువుము.

మెహె—అమ్మా, ఇరా, నాశక్తివంచనలేక ఈ కార్యమును సాధించెదను, పైన దైవమున్నాడు.

ఇర—అహా! న మన మిప్పుడు కుమటపడినది మెహెర్, నేను పోవుచున్నాన అనాయాసమృత్యువు లభించుచున్నది నాకు వేఱ కోర్కెలు లేవు. మీ రిక్కష్టముల గడచి అచిరకాలమున సుఖు లయ్యెదరు గాక! (మృత్యువు)

ప్రతా—హా! దైవమా!

---

— ఆరవ రంగము —

పృథ్వీసింహుని యింటిలో అతడూ భార్య

పృథ్వీ—పద్యమంతా బాగా ఉన్నది, కాని "అక్బరుషా" అను పదముకూడా మూడక్షరములలో నిమిడిన చక్కగా నుండును (జోశీవచ్చును) జోశీ, ఖుస్రోజుమేలాకు పోతివా?

జోశి—అహా, వెళ్ళినాను

పృథ్వీ—ఎట్లున్నది? నీమనసుకు నచ్చెనా? నిజము చెప్పు ఏమి సమారోహము! నేను చెప్పలేదా? అక్బరుషా వారి ఖుస్రోజు!—ఇదిగో నాపద్యము విను—

వాక్పతి ఎట్టులా బ్రహ్మలోకమున
శ్రీపతి యెట్టులా శ్రీధామమునను
మాపతి యెట్టుల మ్మలపైనన శి
చీపతి యెట్టులా చింతామణిస్థ
డక్బరుషా తాను నార్యవర్తమున
భూపతి యట్టులే బ్రోచు నందఱిను.

జోశి—ఇట్టి పద్యములు చెప్పుటకు మీకు సిగ్గేల లేదు? దీనమీా స్తోత్రము హెచ్చునా? కాయముప్పొంగునా? నాలుక చీలికలు కాదా? ఛీ! ఛీ! ఈ నీచస్తుతి, అధమా మోదము, జఘన్య మిథ్యావాదము—

పృథ్వీ—ఇందు తప్పేమి? అక్బరుషా తప్పక ఇట్టి స్తోత్రమునకు తగినవాడు ఇంతకన్న నెక్కుడు వర్ణించినా అతిశయోక్తి కాదు స్వీయబాహుబలమున గాంధారము మొదలు రత్నాకరము వరకు వ్యాప్తమగు సామ్రాజ్యమున కేకచ్ఛత్రాధిపతి కాలేదా? హిందూముసల్మానుజాతుల నేక ప్రేమసూత్రమున బంధింపలేదా?

జోశి—లంపట సూత్రముననే కదా? అతడు రాజ పుత్త్రికులాంగనల నిజోపభోగవస్తుమాత్రములుగా గణించు నని చెప్పదగును.

పృథ్వీ—నీ వాతని చూడలేదు, కావున నిట్లను చున్నావు

జోశి—మీాకృపచే ఆభాగ్యమూ నేడు సమకూరింది

నే డాతని కన్నులార గాంచితిని అంతేకాదు నాచేత నీకత్తి లేకున్న ఈపాటికి మీధర్మపత్నికూడా అతని సహస్రాధిక వారాంగనాతతిలో నొకతెగా చేర్పబడియుండును

పృథ్వీ—ఏమంటివి? నేను నమ్మజాలను.

జోసి—ఎట్లు నమ్మెదరు? ప్రభూ! మీరు సుక్షత్రియులై మానవత్వము మీయందించుకైన మిగిలియుండి పౌరుషము నశింపకున్న ఈయుప్పు దీర్పుడు లేనిచో మీరు నాకు పతిగారు, నే ననాథను స్వశీలము కోలుపోజాలని నన్ను మట్టుబెట్టుటకు మీ కధికారము లేదు నాకు మీరు పతీ కారు, నేను మీకు భార్యనూ కాను. ఎంతని మొఱవెట్టుదును? కులద్రోహులు, భీరులు, ప్రాణభయశంకితులు నగు మిమ్ములందఱిని జూడ పురుషజాతిపై నాకసహ్యము పుట్టి మా మానము గాచుకొనుటకు మేమే ఖడ్గమును ధరించుట శ్రేయమని తోచుచున్నది అయ్యో! అంటరాని మ్లేచ్ఛుడగు యవనుడు కామానలతప్తుడై నీభార్యగాత్రమును స్పృశింప సాహసించుటయు నీ వావార్త విని ఊఱకుండుటయునా? పౌరుషహీనుడా! పాదుషాపై పద్యము లల్లుచుందువా? కవిత్వము కూడ దనను. దాని కిది యుక్తసమయము కాదు మాతృభూమి యగు నార్యావర్తము ప్రపీడితయు, జాతి హీనవీర్యయు, ధర్మము లుప్తప్రాయము నగుచున్నపుడు క్షత్రియుడు స్వకులధర్మమగు సంగరమువీడి సారహీనమగు కవిత చెప్పుట యుక్తమా? కవిత ఎట్లుండవలయును? అందలి భావ

ములు విద్యుల్లతలవలె ప్రకాశించి, ఉరుములవలె గర్జింప, అంకలి గంభీరసంగీతప్రవాహము ఆర్యావర్తము నంతయు ముంచవలయును, దానివలన మానవులు మానవత్వమునకై యత్నింపవలయును దానిమహిమచే తల్లికొఱకు పిల్లలు పాటుపడునట్లు దేశక్షేమమునకై దేశీయు లందఱును భేద బుద్ధి మాని, ఐక్యత నాపాదించుకొని, పాటుపడవలయును దానిప్రభావముచే నన్యాయదేవత కరములు ఖండింపబడి అధర్మపాలనారశ్మి తెగిపోవంగను, అత్యాచారపిశాచగళ మున శాంతిహేతి పడి దాని శిరమునుండి మకుటము జాఱి, అధర్మము అణగద్రొక్కబడి సత్పాలనాశకటము నిరాటంక ముగ పృథ్వీవక్షమున నడిచి అన్యాయదేవత సింహాసనభ్రష్ట గావలయును అట్టి కవిత చెప్పండి అట్టిపాటలు రచియిం చండి, వలదనను ఒక్కసారి ప్రాణములు లేచివచ్చునట్లు అట్టి కవన మొనర్చి నాపీనులకు విందుసేయుము నాథా- నా యవమానవార్తను సందేహింప జనకు కులాంగన లనహ్య మాడి నిజమానభంగగాథల వెల్లడిచేయుదురా ? అక్బరు అత్యాచారమును విశదముగా నెఱుంగదలంతురేని మీవదిన గారి నడుగవచ్చును ఆమె సతీత్వమును కులధర్మము నత్యజించి సామ్రాజ్ఞిత్వ పారితోషికాభరణచయము ధరించి కులుకు చున్నందున ఆమెపతి మీఅన్నగారు రథికగౌరవమునకు పాత్రు లగుచున్నారు ధనమునకు ధర్మపత్నుల నమ్ముకొనునంత దుర్దశ ఆర్యజాతికి పట్టినదా ! ఏమి యధఃపతనము !

పృథ్వీ—నా కేమియు తోచలేదు ఏమి చేయగ లను? అక్బరుషా సర్వశక్తుడు. నాచేత నేమగును? ఉపాయము నామిత్రుల నడిగెదను అదే వారువచ్చుచున్నారు నీవు లోనికిబొమ్మా (ఆమెపోవును-మిత్రులువత్తురు)

మార్వార్—ఖుష్రోజుమేలా సమాప్తమాయెనా?

గ్వాలియర్—ఆ రాజపుత్రమహిళా సాంవత్సరికా వమానలీలాసంక్షేప మాయెను

చాందేరి—బికానేర్, ఏ మాలోచించుచుంటివి? మా టాడ వేమి?

బికా—చెప్పుట కేమున్నది?

చాందే—బికానేరు పృథ్వీసింహుల మోములు వ్యస్తములైనవి, కారణ ముండవలయును

గ్వాలి—ఈసారి ఖుష్రోజున విపరీతములు ఘటించె నని జనరవము చెవినిబడినది నిజమేనా?

బికా—జనరవమున కెక్కడికి? లోకులు కాకులు!

మార్వా—మీరాణిగారి కెట్టి అభ్యర్థనము కల్గెనో వినలేదా?

బికా—యథాయోగ్యముగానే జరిగింది- పృథ్వీమాట ఏమి?

పృథ్వీ—మాయన్నదమ్ముల కెట్టి యాదరణ జరిగెనో మీరాణుల నడగండి రచ్చలో కీడ్చి మమ్మ రట్టాడనేల?

మార్వా—సరే-అందుకు ప్రతిక్రియమాట?

బికా—ప్రతిక్రియ సహించియుండుటే స్వశక్తి నేమి సేయగలము?

పృథ్వీ—"కంచెయే చేను మేసిన కే దెవ్వరు?" (జోశి వచ్చును)

జోశి—నమస్తే రాజకుమారా! రాజపుత్రజాతీ! ధర్మమా! నామాట వినుడు నేను జోశీబాయిని, పృథ్వీసింహుని భార్యను. నవవధువునగు నేను సిగ్గు పోనాడి మీ చెంత జేరితిని, కారణ మిది—నాకు నిన్న ఘటించిన భయంకరవృత్తాంతము మీ నల్వుర చెవులను వేయుచున్నాను. ఆ వార్త మనసులో నుంచుకొనలేక యిటు వచ్చితిని ఒడలంతయు దగ్ధ మగుచున్నది వినుడు నేను ఖుస్రోజు ఉత్సవమునకు బలవంతముగా పంపబడితిని మానవతిగా పోయి తిఱుగునలలో మానభంగము పొందితిని నేనొక్కతెనే కాదు కులాలసాలీలయందు రాజపుత్రనారులలో సగము మానభంగము నొందిన వారే లజ్జావహమగు గాథను, ఘృణావహమైన వార్తను, నేను మీకు వినిపింపవలసివచ్చె ఉదాసీన దీక్షనిద్రా ముద్రితులైన వారి నీ చెప్పుదెబ్బ కొట్టి లేపుటకు వచ్చితిని హిందువు లింకేమిచేయ లేకున్న వారిసతీత్వరక్షణార్థము ప్రాణములైన పరిత్యజింపగలరని నాయూహ నేటి రాజబలము కూడ నశించెనా? మనుష్యత్వము మట్టిలో కలిసెనా? అబలా సతీత్వరక్షణార్థమైన మహంపంజనేయ సాహసించు రసపుత్ర వీరుడు లేడా?

మార్వా—లేకేమి? ప్రతాపసింహు డున్నాడు

జోశి—అంతే-ఇక లేరా? ఆప్రతాపుడే సర్వవ్యాపి యగు ఈ యవమానమహాసముద్రమును తరించిగ జట్టి-మానవగౌరవమును నెగులగొట్టు నీర్ఘుంర్ఘూమారుతోద్వేగమునకు శిరమెత్తి ప్రతిఘటింపగల్గిన మేగుసమానధీరుడు-పరప్రసాదభుక్కులగు నీచరాజపుత్త్రులమధ్య ధర్మసంస్థాపనార్థము ప్రశంసనీయమగు దారిద్ర్యమున గ్రింకియు స్వేచ్ఛాపతాకము నెత్తగల్గిన శూరు డాతడొకడే? ఇక లేరా? ఆ ప్రతాపు డిమాను సార్వభౌముని వశ్యతాస్వీకార మొనర్చినని దింటిని ఇంతవరకూ హిందూన రు లాతని నామపంచాక్షరిని జపించుచుండిరి నే డాప్రతాపుడు శోకగ్రస్తు డాయెను ఇంకెవ్వరును లేరా? రాజపుత్త్రశూరులు వారి కులకాంతల గౌరవము నిల్పలేకుండిన, రాజపుత్త్రవీరులు తమభార్యల మానమును రక్షింపలేకుండిన నికవారి కొకటియే దారి అంత్యావలంబన మదియే (కత్తిదీసి) దీనిచ నసనైన రసపుత్త్రులు కన్నులు తెరచుదురు గాక! ఇందువలననైనా హిందువు లుద్ధులై వారియందు మనుష్యత్వము ప్రజ్వలించుగాక! (పొడుచుకొనును.)

పృధ్వీ—జోశీ! జోశీ! ఎంతపని చేసితివి!

జోశి—దూరమున నుండుడు నన్నంటుటకు మీరర్హులు కారు నన్నవమానించిన పాదుషావారి పాదధూళి మీశిరమున ధరించి వారిపదలేహన మొనర్పుడు-వారి గుణసంకీర్తన మొనర్చుచుండండి ధర్మమూ మీరూ వేరై

తిరి, నేను ధర్మము నెంచుకొంటిని మనకు నేటితో సంబం
ధము సరి నా ధర్మము నొకరు నిల్పలేకుండిన నేనే నిల్పు
కొందును-మీరందరు సుఖులై రాజభోగముల ననుభవింపు
చుండుడు (మృతి)

---

## —ఏడవ రంగము—

---

ప్రతాపసింహుని కుటీరము-

గో॥ సిం॥ ప్రభూ! మీరు పాదుషావారికి లొంగినని
ఆగ్రావాసులు మహోత్సవముల గావించుచున్నారు-ఇంటింట
మంగళవాద్యములు, నృత్య గీతములును చెలగుచున్నవట-
ప్రతిసౌధమాడమందును రంజితపతాకము లెత్తుచూ, రాజ
పథమంతటా దీపావళి నుంచిరట-ఇది రాణావారికి సమ్మాన
హేతువా?

ప్రతా—సమ్మానహేతువే వేరేమి చేయగలను?

గో॥ సిం॥—సార్వభౌముడు తనగద్దెకు దక్షిణపార్శ్వ
మున ప్రథమాసనము మీకు నియమించెనట- (శక్తసింహుడు
వచ్చును)

ప్రతా—సార్వభౌమునకు నాపై అసమానుగ్రహము
శక్తా! రమ్ము

శక్త—అన్నా, మొగలులతోడి యుద్ధమున మీకు
సాయముచేయ వచ్చితిని

ప్రతా—ఎవరి సాయము అక్కరలేదు తమ్ముడా! పాదుషావారి ననుగ్రహాభిక్షు యాచించితిని ఇక యుద్ధముండదు

శక్త—ఏమిది? మీరు మొగలుల ననుగ్రహభిక్ష యాచించితిరా?

ప్రతా—ఔ, సర్వశక్తుడగు సార్వభౌమునితో నాకు సమర 'మేల' చిత్తూరు పోనిమ్ము, కోమలమీరు పోనిమ్ము, మేవారమును పోనిమ్ము

శక్తి—ప్రపంచము నవ్వదా?

ప్రతా—నవ్వనీ

శక్త—మానసింహుడు నవ్వును మార్వార చాందేరి రాజులు గేలిసేయరా?

ప్రతా—(ట్టూర్పు తో) కానీ, ఏమి సేయుదు! అశక్తుడను!

శక్త—అన్నా, మీనోట ట్టి వెలితిమాట వెలువడు నని స్వప్నమందైన భావింపనైతిని

ప్రతా—ఏమి సేయుదును తమ్ముడా, ఎల్లకాల మొక్క తీరున నుండునా?

శక్త—నేననే ఎదే, ఈనాటితో మేవారమునకు దుర్దినములు గతించి, ఇక సుదినములు రానున్నవి-అట్టి సూచన చేయుటకే నేను వచ్చితిని

ప్రతా—ఎట్లు?

శక్త—అన్నా! పిక్ శోర్ దుర్గము మొగలుల నుండి జయించితిని

ప్రతా—మంచిపని చేసితివి-నీకు సైన్య మెక్కడిది?

శక్త—సైన్యమును త్రోవలో కూర్చితిని. మార్గమున పోవుచూ "నేను ప్రతాపసింహుని తమ్ముడ, శక్తసింహు డను. నాయన్నకు సాయము చేయ నేగుచున్నాను-వచ్చేవా రున్న నాతో రండు" అని కేక వేయునంతకి ఇంటిలోని గృహస్థు లెల్లరిని, తలిదండ్రులు తమ సంతానమును, కృప ణులు ధనమును, త్రోవలో మూటలు మోయువారు మూటలు నావల వైచి శస్త్రముల నందుకొనిరి-కర్షకులు లాజానుశాహులు నాయతివక్షులు నైరి అంతట పిన్నసైన్యము విస్తృతమయ్యె అన్నా, నీపేరున నెట్టి మహేంద్రజాలనిభమగు ఆకర్షణశక్తి కలదో నీ వెఱుగవు నే నెఱుగుదు.

(పృథ్వీసింహ భామాసాలు వత్తురు)

పృథ్వీ—రాణాప్రతాపసింహునకు జయము

ప్రతా—ఓహో! పృథ్వీసింహా! సార్వభౌమునకు క్షేమమా? నీవు నావద్దకు వచ్చుటకు హేతువేమి?

పృథ్వీ—మహారాణా! మీరు పాదుషావశ్యతా స్వీకార మొనర్చితిరా?

ప్రతా—అవును

పృథ్వీ—హతభాగ్య నైతి నా? ఆర్యావర్తమా! తుదకు ప్రతాపసింహుడూ నిన్ను పరిత్యజించెనా? అసమప్రతాపా

ప్రతాపా! మేమందఱము సన్మార్గగళితులమై మొగలదాసు లమైనను నిన్ను కులదేవతవలె నారాధించుచు ప్రాణములు చిక్కబట్టితిమి ఈ సార్వజనీనధ్వంసమున నీశిర మొక్కటే సార్వభౌమునెదుట నతము కాలేదని సంతసించుచున్నాము. రజపుత్రుల ఆశలన్నియు రజపుత్రులవలననే కడతేరవలయునని మేమందరము మా కులగౌరవము కూలకుండ సేయుభారము నీపై వేసియున్నాము నీవు లేకున్న ఈపాటికి రజపుత్రవీరుల శౌర్యమును తత్సతీమణుల గౌరవమును అక్బరు నేలపాలు చేసియుండును. మానసింహాదికులమర్యాదను ఖుస్రోజు మేలాయందమ్మినారు మేవారినాయకుల మొక్కటే మిగిలి యున్నది నీ పితరసంపద వీగినను గౌరవసంపదను కాపాడ గల్గితివి పౌరుషమును శస్త్రము నాధారముగాగొని క్షత్రి యోద్ధతి సాధింపగల్గితివి మొగలుల యున్నతి మున్నిపోవు తరుణము సంప్రాప్తించె క్షత్రియశౌర్యబాహు మ్లేచ్ఛగ్రహ విముక్తుడు కాగలడని కొండంత ఆశతో కులుకుచుంటిమి నీ వట్టి యాదర్శముకూడ లేకుండ జేసితివా?

ప్రతా—పృథ్వీసింహా! నీవు, నీ భ్రాతయగు బికానేరు పతి రాయసింహుడు, గ్వాలియరు, చాందేరి, మార్వారనాథు లును సర్వజఘన్యమగు సార్వభౌమస్తుతిగానము చేయుచూ, సకలభోగముల తనియుచుండియు, రాజస్థానమునందెల్ల సామాన్యుడను, దుర్బలుడను, గృహహీనుడను, రెండుపిడి కెళ్ళ నివ్వరికూడు తిని వన్యమృగమువలె కాలము గడుపు

పోన్న నన్నాదర్శముగ నెంచుచుండిరన్న నా జీవితము లజ్జా
వహముగాక ప్రశంసనీయ మనియే భావించెదను, కాని మీ
కది లజ్జాకరము కాదా? ఒక్కడ నెంతకాలము చలము
సాధింపగలను?

పృథ్వీ—ప్రతాపా! నిజము. అధమమగు భల్లూక
మును పట్టి కజేసి ఆట లాడింపవచ్చును గాని, గహనాంతర్గు
హాల విహరించు సింగపుకొదుమ చెంత జేర నెవరు సాహసిం
పగలరు? దీపములెన్నియో యుండవచ్చు, సూర్యు డొకడే.
సస్యశ్యామలములను ప్రత్యేకముగ జనులు చీల్చి చరణదళి
తము చేయగలరు, కాని ఉత్తుంగదారిద్ర్యగర్వ సంకలిత పర్వ
తశృంగము నెవ్వరు చేర తరముగునా? ప్రతాపా, సంసారులు క్షుద్ర
ప్రాణులు గాన క్షుద్రములగు సుఖదుఃఖములకు లొంగి క్షు
ద్రజీవనము చేయుచూ పట్టణములయందును పల్లెలందు
ను వసింతురు. వారిమధ్య అప్పుడప్పుడు భస్మాచ్ఛాదిత దే
హుడును, ఋక్షుకేశుండును, అకశవుడు, అరణ్యవాసియు నగు
పెద్ధసన్యాసి ఆవిర్భవించి నూతనతత్త్వము, నూత్ననీతి, ధర్మా
చరణమును వారికి నేర్పును. అత్యాచారుల ఉన్మత్తఖడ్గము
వాని సత్యధర్మజ్యోతిని శతధా వికీర్ణము చేయును. నీరంధ్ర
కారాగారాంధకారమునను వాని మాహాత్మ్యము వెలుగుచుం
డును. జ్వలదగ్నిశిఖలు వాని కీర్తిని సర్వదిశల ప్రసరింప
జేయును. లక్షకోటి గృహస్థులమధ్య నీ వట్టి సన్యాసివి. దేశో
ద్ధారణమంత్రము బోధించుటకు మాత్రమే నీ వవతరింపలేదు.

పరీక్షిని దాని నిర్వహింపవలయునో దృష్టాంతరూపమున ప్రపం చమునకు బోధించినావు—అట్టినీ వీనాటి కొకరియధీనమున నుండ నిశ్చయింపవలసి వచ్చెనా?

ప్రతా—పృథ్వీసింహా! రాజపుత్రుల మందఱు మేకమై మాతృభూమి నుద్ధరింతమని శపథము చేసికొన్నచో కార్య సాధనము సుకరమగును. నే నొంటరినైనను స్వదేశ స్వధర్మ రక్షణార్థము సార్వభౌమునికి ప్రతిఘటించి పోరాడు చున్నప్పు డొకరాజైన చిటికెనవ్రేలు కదల్పలేదు ఇప్పుడు నేను జీర్ణుడ, సర్వస్వహీనుడ, నిస్సహాయుడ, పారివారిక శోకావమగ్నుడ నైతిని, నాచే నేమగును? పృథ్వీ! నా ముద్దుకూతురు ఇరాదేమి మమ్ము విడిచి స్వర్గమున కేగెను నిద్రాహారములు లేక అడవులయందు శీతవాతాతపముల వాతబడి నాయుద్యమమునకు బలియయ్యె నేను మునుపటి ప్రతాపుడను గాను - కేవల తత్కాంకాళమాత్రుడను.

పృథ్వీ } ఇరాదేవి గతించెనా?
శక్త } అయ్యో! అయ్యో!

ప్రతా—దారిద్ర్యకఠోరతుషారసంపాతమున దారిత యయ్యె.

పృథ్వీ—ఆహా! దైవమా, మహాత్ముడైన సత్కా ర్మకూ ఇది యా పురస్కారము? సద్వర్తనమున కిదియా పరి ణామము? ప్రతాపా, నేనుకూడ నీతో నసుగు ఖినే, కాని నీ

వృత్తముడవు నే నధముడను. నాభార్య నరాధముడనగు నన్ను వీడి స్వర్గమున కేగెను.

ప్రతా—జోశీ గతించెనా!

శక్త—అయ్యో! ఎట్లు!

పృథ్వీ—కళంకితమగు ఆవృత్తాంత మెఱింగించుటకే వచ్చితిని - ఖుస్రోజుత్సవమున నా నవవధువును సార్వభౌముని రాణులు నిమంత్రణ మొనర్చిరి ఆమె కిష్టము లేకున్నను పాదుషాకు వెఱచి నే నామెను నిర్బంధించి పంపితిని సార్వభౌముడు పైశాచికలాలస నామె కరము పట్టుకోగా శాణితఛురికాసాహాయ్యమున ప్రాణము నిల్పుకొని యింటికి వచ్చి రాజపుత్రగణసమక్షమున కత్తిని వక్షమున గుచ్చి ఆమె ప్రాణముల బాసెను.

ప్రతా—అయ్యో! హిందూ రాజగణము నవమానించట చాలక సార్వభౌముడు రాజపుత్రిమహిళలపై నత్యాచార మొనర్ప నారంభించెనా! అక్బర్, భారతవర్ష విజయి వగు వీరుడవా!

శక్త—ఇది వానికి క్రొత్త గాదు దీనికి తగిన ప్రతీకార మొనర్చి ఈయప్పు తీర్పవలయునా లేదా!

పృథ్వీ—ప్రతాపసింహా! ఇందు నీసాహాయ్య మపేక్షించి ఆగ్రానుండి నిన్ను వెదకుచు నిట వచ్చితిని. నన్ను రక్షించుము అవమానవహ్ని దహించుచున్నది.

గో॥సిం—ఈమాట వినియు రాణావా రూరకుందురా!

ప్రతా—నే నేమి చేయగలను? శుద్ధశూన్యుడను, సైన్యము లేదు, పదుగురైన లేరే!

శక్తి—సాతనసైన్య సమావేశము నే నొనర్తును

ప్రతా—సామ్ముండినకదా సైన్యమును కూర్చుట సమరము చేయుటయు సంభవించును. ప్రస్తుతమున రాజకోశ మందొక రాగినాణెమైన లేదే?

భామా—మహాప్రభూ! సొమ్మున్నది

ప్రతా—సొమ్మున్నదా? నీవు లెక్క చూడ నట్లున్నది

భామా—మీమాట నిజమే కాని సొమ్ము లేక పోలేదు

ప్రతా—మంత్రీ, నీకు పిచ్చి—సొమ్మెటనుండి వచ్చునో చెప్పుము

భామా—చిత్తూరు సుదినములయందు రాణాలు మా పూర్వపురుషుల కమిత ధన మొసగియుండిరి దాని నేను కొంత పెంచితిని ఆజ్ఞయైనచో ప్రభువువారి చరణకమలముల కర్పింతును

ప్రతా—ఎంత ధనమున్నది నీ చెంత?

భామా—ఇరువది వేలసేనకు పదుండ్లేండ్లకు సరి పడును

ప్రతా—మంత్రిసత్తమా? నీ ప్రభుభక్తికి సంతసించి తిని, కాని దత్తవిత్తస్వీకారము రాణాలకు నియమగహా

తము. నీకు మావారిచ్చిన ద్రవ్యమును నీవే యనుభవింప వలయును.

భామా—ప్రభూ! భృత్యులు ధనమును ప్రభువువారు ప్రకృతమున స్వీకరించుట అధర్మము కాదు, మీరు సంకో చింపనక్కరలేదు. మేవారమున కలికష్టదినములు ఘటించినవి. లజ్జిత హిందూస్త్రీల చూడుడు—హిందువులకింకేమి యున్నది? దేశమూ పోయె, ధర్మమూ పతితమయ్యె, నారులసతీత్వము మాత్రము నలంగుట లేదు. అదికూడానశించుకాలమాసన్న మయ్యె, మహారాణా, మీరు దాని గావవలయును. మీపూర్వ పురుషులు మాకిచ్చిన ధనమును నేను మీ కిచ్చుటలేదు. మీ చేతికిచ్చుచున్నాను స్వదేశమునకై, స్వధర్మరక్షణమునకై, స్వకులసతీత్వ రక్షణమునకై, మాతృభూమి గౌరవమానములు నిల్పుటకై-మీ కిచ్చుచున్నాను. మీ రాజ్యమునకై ఉపయో గింపుడు, మీ కొఱకు వద్దు. కావున దీని స్వీకరించి కార్య నిర్వహణమునకు గడంగుడు.

శక్త—దేశోద్ధారణమునకై ధనము స్వీకరించుట తప్పుగాదు.

అంగ్రు—సత్యము! సత్యము! సత్యము!

ప్రతా—అట్లయిన చేనీ దానమును ప్రతిగ్రహించి రాజపుత్రసైన్యమును నొకపీఱుకు మిగిలియున్నను హిందూ నారుల సతీత్వము త్యుణ్ణముగాకుండ జూచెదను. అక్బర్, నీవు పాముపుట్టలో పాదము పెట్టితివి, ఫల మనుభవింతువు

చూడుము (పోవును)

పృథ్వీ—ఇక భయము లేదు-సుప్తసింహము మేల్కాంచెను. మంత్రిసత్తమా, మున్ను దధీచి యను మహర్షి ఇంద్రునకు దైత్యసంహారమునకై వజ్రాయుధనిర్మాణమునకు వెన్నెముక ఇచ్చెనని పురాణములందున్నది. అది సత్యయుగము. కలియుగమున నిట్టి మహనీయదానము చేయుట నీయందు గంటిమి.

భామా—పృథ్వీసింహా! హిందూసతిమణుల శీలము విపన్నమౌనెడ సర్వస్వము నిచ్చియైన దాని రక్షింప సమకట్టని సికృష్టహిందు వుండునా?

శక్త—అయ్యలారా! నేనుపోయి సైన్యము సమకూర్తును. ఒక మాసములో నిరువదివేల బలము సజ్జితమొనర్చి, బందూకిశబ్దమువల్ల రాజస్థానమునెల్ల నుత్తేజితమొనర్తును.

పృథ్వీ—శక్తసింహా! నేను నీవెంట కండెదను. ఒకనాడు నాభార్య నాతో "కవిత్వము నీ కలవడినందుకు రాజస్థానమున నెల్లదిక్కుల వ్యాపింపదగు పాటల రచింపుము," అని చెప్పినది. నేడట్టి గీతముల రచియించెదను. ఆగానము గగనవ్యాపియై, ప్రతిధ్వనులతో పృథ్వీమండలమెల్ల పరిసరించి రాజపుత్రస్థానమందలి గట్టులను, ఘట్టలను, గుహలను, లోయలను చొచ్చి అత్యాచారము నంతము చేయుగాక!




# ఐదవ అంకము

## —రెండవ రంగము—

### కోటలో శక్తసింహుడు

శక్త—హత్య! హత్య! హత్య! ప్రపంచమంతా కసాకొట్టు. భూకంపము, ఉప్పెన, రోగము, నాధకము—వీటివలన నిరంతరము హత్య జరుగుచే యున్నది. అది చాలక క్రూర మృగములు, నరులూ చేయుహత్య. దీనితో సృష్టికర్తకు తుష్టి లేదు. యుద్ధము, రాజద్రోహము, కలహము, లోభము, లాలస, క్రోధము—మొదలగునవి విశ్వవ్యాపియగు రక్తోచ్ఛ్వాసమందలి భైరవస్రోతమునకు ఉపనదులై అనుక్షణమూ దాని నభివృద్ధి చేయుచుండును. పాపము—మానవుడు హత్యచేసిన పాపమట! ఈశ్వరుడు సృజించిన ఉల్కలు, పిడుగులు, మొదలగునవి చేస్తే హత్య పాపము కాదట! సంఘమున నొక మానవుడు వేరొకని జంపిన నది హత్యయట! యుద్ధమున నెందరిని జంపినను అది హత్యయని గణింపక, వీరకర్మ అని ప్రశంసింతురు! హా! నరుడు బుద్ధిమాంద్యమున నెట్టి ధర్మనీతివినాశ్య

మొనర్చెను? దూరమున ఫిరంగుల రవము వినబడు తున్నది- హత్య మొదలయినది కాబోలు. అదే మృత్యు హుంకారము. (దుర్గాధ్యక్షుడు వచ్చును) ఏమి వార్తలు?

దుర్గా—ప్రభూ! దుర్గపూర్వప్రాకారము బద్దలయి నది- ఇక రక్షణ మసంభవము

శక్త—రాణావారికి దుర్గావరోధవార్త పంపితిమి- ప్రత్యుత్తరము లేదా?

దుర్గా—లేదు

శక్త—సరే- సైన్యము సజ్జితము చేయుము- జోహారు వ్రతమునకు నే డుద్యాపనము- త్వరగా పొమ్ము (అతడు పోవును) మహాబత్ యుద్ధనిపుణుడు- ప్రాకారము లన్నిటిలో హీనబలముగు పూర్వప్రాకారము నని బట్టినాడు భయము లేదు మృత్యువు నాహ్వానముచేయుచూ చాలదినములనుండి ఎదురుచూస్తున్నాను సలీ మప్పు తీర్చుటకు సమయము చిక్కదాయెను, కాలగతి! (దౌలతు వచ్చును) ఏమి దౌలత్, ఆసమయమున నిటు వచ్చితివి?

దౌల—నాధా, ఉదయముననే యిటువచ్చితి రేల?

శక్త—(నవ్వుచు) చచ్చుటకు- తెలిసినదా? నీవు లోనికిబొమ్ము ఏమి నిలుచుంటివి? బోధపడలేదా? సరే నే ననేది బాగా గ్రహించుము మొగలసైన్యము మనదుర్గ మును ముట్టడించినది

దౌల—అది తెలియును

శక్త—ఇప్పటికి వారి యాక్రమణమునఁ పూర్ణప్రాయమైనది రాజపుత్రులలో నొక యాచారమున్నది దుర్గము శాత్రవుల కర్పించుటకు మున్ను దుర్గాధిపతి తనప్రాణములు సమర్పింపవలయు అందుకే ససైన్యుడనై దుర్గము వెడలి యుద్ధరంగమున మరణింపబోవుచున్నాను. అదిగో ఫిరంగిరవము, దారిపడినది వారువత్తురు, కావున లోనికి పొమ్ము

బాల—నేను మీతోడ వచ్చెదను.

శక్త—నీవా? యుద్ధక్షేత్రమునకా? రణరంగము ప్రణయశయ్య యనుకొంటివా? అది మృత్యులీలాభూమి

బాల—నాథా! మరణించుట నేనెఱుంగుదు

శక్త—సాధారణ మరణమైనచో దినమూ పదిసారులు చావవచ్చును ఇది తల్పమృదుమృత్యుశయ్య కాదు ఈ ప్రాణత్యాగమున అభిమానజనాశ్రుపాత ముండదు, ఇది ఘోరము, హింసనంతము, స్థిరము, కష్టతమము.

బాల—నే నెఱుఁగుదున, మొగలస్త్రీని, మృత్యువునకు జంకుదాన గాన, యుద్ధరంగము నాకపరిచితము కాదు, నన్ను నీతోడ రానిమ్ము, నాధా

శక్త—మృత్యువన్న నింత ఆసక్తి యేల? నీవు చిన్నదానవు, ఇంక కొన్నినాళ్ళుండి మహాసౌఖ్యము ననుభవింపుము

బాల—తెలిసినది ప్రాణకాంతా! నీవ్యంగ్యము బోధ

పడినది నిష్ఠురుడా, నిన్ను నేనెంత ప్రేమించుచున్నానో యెఱుగ జాలవు!

శక్త—దౌలత్, పృథ్వియందు నాకంటె సుందరతర యువకు లెందరులేరు?

దౌల—ప్రభూ! పురుషుల ప్రేమ యెట్టిదో నే నెరుగను కాని స్త్రీ యొక్కనినే ప్రేమించును. ప్రేమ యనునది పురుషులకు దైహికలాలస కావచ్చును, కాని స్త్రీల కది శల్యగతధర్మము. ఆత్మ నంటియుండును విచ్ఛేదమును, వియోగమును, నిరాశయందు, అవజ్ఞయందునూ నారీప్రేమ ధ్రువతారవలెనే స్థిరముగా నుండును

శక్త—భగవద్గీత లప్పగించు చుంటివా? మంచిది-అట్లే కానిమ్ము, రమ్ము- మరణ మంత సుకరమనియు, లోభ నీయమనియు దలతువేని నే నాటంకపెట్టను ఏ శయ్యను మరణింతువు?

దౌల—వీర శయ్యను మీ ప్రక్క-యుద్ధము సల్పుతూ మరణింప వలతును

శక్త—దౌలత్, వాగ్యుద్ధముకన్న భిన్నమగు యుద్ధ మెఱుగుదువా?

దౌల—యుద్ధ మెన్నడూ చేయలేదు, గాని తద్విధానము తెలుసును

శక్త—ఆహా-అట్లైన వర్మచర్మములతో రమ్ము-కాని ఫిరంగిరవలు వచ్చునపుడు వాటిని ముద్దుపెట్టుకొనేవు

సుమా, ముక్కముక్కలగుదువు, మొకటికే మోసము వచ్చును వీరవేషము దాల్చి రమ్ము నిజముగా నీమె నావెంట చచ్చుటకు వచ్చుచున్నది! నారీజాతి పేమ విలాసము నకు భోగమునకును కాదా? ఇది యొక సమస్యే

(దుర్గాధ్యక్షుడు వచ్చును)

దుర్గా—ప్రభూ! సైన్యము సిద్ధము

శక్త—ఇదే వచ్చుచున్నాను (దౌలతు వచ్చును) అయ్యో! నీవు పొమ్ము-దౌలత్, అదే శత్రుసైన్య మగుపడి నదా? నే నా వ్యూహమును చీల్చుకొని పోయెదను నీవు రాగలవా?

దౌల—ఆహా, రాగలను

శక్త—అదిగో అశ్వము, ఈ యుద్ధమున మరణ మవశ్యంభావి సుమా!

దౌ—అట్లే కానిమ్ము

శక్త—నడువుము-నీకు భీతి జనింపదా?

దౌల—భీతీ! నీ చెంతనున్న నాకు భీతియేల? నీవు మృత్యుముఖమున పోరుట కానున్నడ వగుట చూస్తూన్న నాకు భీతి యెక్కడిది? నా సర్వస్వమును కోలు వోనున్న కాల మున నాకు భయమేల? నాథా! ఇన్నినాళ్లనుండియు నాపై మీకు ప్రేమ యున్నట్లు తోచదు ఒకనాడైనా ప్రేమించ రాలని ప్రతీక్షించుచుంటిని ఒకసారియైన ప్రేమార్ద్రకటాక్షముల వీక్షింపరా అను నాసతో నుంటిని-అప్పుడైన అవ్యాజప్రేమతో

"నా దౌలత్" అని పిలువరా అని యువ్విళ్లూరుచుంటిని-అట్టి యాశకూడా నేటితో నశించెను ఇంక నెవేల?

శక్త—అటులనా? రమ్ము

దౌల—పోవుదము (శక్తుని చేతులను పట్టుకొని ముందు నిలుచును)

శక్త—ఏ మందువు?

దౌల—మరణించుటకు పూర్వము శత్రుసైన్యముల కెదురుగా క్షణమునకు నీ కోలాహలమధ్యమున-ఈ జీవన్మరణ సంధిస్థానమున-మృత్యుదేవత యెదుట-ఒక్కసారి "నిన్ను ప్రేమింతు న"ని మనస్ఫూర్తిగా అనరా? (కోలాహలము)

శక్త—దౌలత్, యుద్ధక్షేత్రము ప్రేమికుల శయ్యాగృహము కాదని మొదట నే చెప్పలేదా?

దౌల—ఔను. కాని నా దొక్కటే కోరిక—చివరముద్దు చెల్లింపరా? స్వజనము-విలాసము-భోగమునూ విడిచి మీ యాశ్రయము చేరితిని, ఇన్నాళ్ళునుండియు ఆమాట విందునేమో అని ఎదురుచూచుచుంటిని, అట్టి సౌభాగ్యములభింపలేదు నేడు నేను చచ్చుటకుముందు దాలోపము తీర్పరాదా? ఒక్కసారి "నిన్ను ప్రేమింతు"ననరాదా?

శక్త—ఇదియా యుక్తసమయము?

దౌల—ఇదే సమయము-సూర్యోదయ మగుచున్నది, మృత్యుదేవత కరాళగర్జనము శతఘ్నీరవరూపమున వెలుగుచున్నది, వెనుక సంసృతి, ముందు మృతి, ఇంతకన్న సుయోగ

ముంచునా? ఒక్కసారి యనుము- ఇదివర కెన్నడూ ఆవాక్య
ధారసమును వీనులార నే గ్రోలలేను అందుచే నాప్రాణము
లన్నియు క్షుధితతృషితములై నిష్ఫలప్రత్యాశతో నెదురు
జూచుచున్నవి- ఒక్కసారి యనుము ఆ రసము చెవులలో
బ్రోవుచుండ నిరతిశయ సుఖమున ప్రాణములు బాసెదను

శక్త—దౌలత్! నా కన్నులు కంఠమును బాష్ప
రుద్ధము లగుచున్నవి!

దౌల—నాధా! ఒక్కసారి యనుము (కాళ్ళపై బడును)

శక్త—సమ్మోహనా! నే ను

దౌల—సమ్మోహనమా! నీ మాట నమ్ముకుందునా? నీ
చరణములందే నా యాశలన్నియు నిక్షిప్తము జేసితిని, నీ
వేమన్న నే నంగీకరింప నీమాట మొదలితధ్యమిధ్యావిత
ర్కము నా పనిగాదు, ఇదివర కెన్నడు నట్లు చేయలేదు,
ఇప్పుడు చేయబోను. మనసులోనిమాట చెప్పుము, దానిని
వేదవాక్యమువలె భావింతును ఇప్పు డామాట ఎందుకం
దువా? నే నబలను-నారీజీవమున కొకటియే ఉత్తమ లక్ష్యము,
అదియే పరమావధి-"మగనికి తనపై కూర్మి కలద"నుమాట
కంటె ఉత్కృష్టవార్త యిక లేదు ఒక్కసారి అనవా?

శక్త—దౌలత్, నీ వింత సుందరివా? నీ ముఖమున
దివ్యజ్యోతి కానవచ్చుచున్నది నీ కంఠమునుండి అవ్యక్త
మధురఝంకారము వెలువడుచున్నది. ఇప్పటిదాక నీ నైజ
మెరుగలేకపోతిని- మూర్ఖుడ, అంధుడ, స్వార్థపరుడను, పృథ్వి

యంతయు స్వార్థమయమే అని భావించితిని యాథార్థ్యము నేను తెలిసినది దౌలత్, దౌలత్, ఎంత పని జేసితివి! నా యసిగతధర్మము, స్వజాగతధారణ, మర్మగతవిశ్వాసము నొక్కతట్టిలో తూలగొట్టితివి-కాని ఆలస్యమయ్యె!

దౌల—అవే రణవాద్యములు మ్రోగుచున్నవి ఇక నాలస్యము వలదు-ఒక్కసారి అనుమునాథా! ఒక్కసారియే

శక్త—నిన్ను ప్రేమింతును దౌలత్ త్రికరణశుద్ధిగా జెప్పుచున్నాను-నా ప్రాణములాన-నిన్ను ప్రేమింతును నీ దివ్యసుందరశీల మద్వితీయము-అది నాకంట బడకుండునట్లు నా భావస్రోతమునకు అడ్డకట్టగా అహమికయను నొక పెద్ద బండ యుండెను ఈ క్షణమున నీవు దాని నెగురజిమ్మితివి-ఇప్పుడు నీ నిజస్వరూపము గనడముచేత, అవిద్య నశించి, నా హృదయము నీ హృదయమును జొచ్చి దానితో మేళవించుటవల్ల భ్రాంతియను తెర జారెను నిన్నువశ్యము ప్రేమింతు-నా హృదయము కరిగి నయనవారియై కంఠము నించెను, కాని నా ప్రేమ గన్పరచుటకు తగిన సుయోగము లభింపదాయె కదా అని చింతిలుచున్నాను దౌలత్, నేను మృత్యుసముద్రమున మున్గుచున్నాను, కావున నీయందలి ప్రేమ కిదే మొదలు, ఇదియే తుద! అంతా క్షణికము

దౌల—ఏదీ, ఒక్కసారి నన్ను నీయక్కున జేర్పుము-అంతటితో ధన్యనై తరింతును

శక్త—ప్రేయసీ- నేనుఁ ధన్యుడ నయ్యెదను-(కౌగిలించును)

దౌల— ఇక మాటలేల' దివ్య స్వప్నము-సుందర ముహూర్తము, మృత్యుముఖమున దాని భంగము సేయు జనదు. సమరతరంగముల సముయుదము రమ్మా (పోవుదురు)

(దుర్గాధ్యక్షుఁడు వచ్చును.)

దుర్గా— యుద్ధము ప్రబలుచున్నది, ఇక మాకు జయాశ లేదు ఆవంక వేనవేలు మొగలులు, ఈవంక వేయి మంది రసపుత్త్రులు-ఏమి వికటఝుంకారము' ఏమి మత్త కోలాహలము'

(తెరలో జే మేవారలక్ష్మికి జే' జే' ప్రతాసింహ రాణావారికి)

అమ్మయ్య ఇంక భయము లేదు-రాణావారు ససైన్యులై దుర్గరక్షణార్థము దయజేసిరి-మావారి నుత్సహింప నేగెదను

—మూడవ రంగము—

[శిబిరమున ప్రతాపుడు సర్దారులు]

ప్రతా— కాళికాదేవి కృపచే మనకు జయము చేకూరెను

పృథ్వీ—ప్రభూ' మహాబత్ చెరలో నున్నాడు

గోవి—ఎనిమిదివేల మొగలులు రణభూమిని శయనించిరి.

ప్రతా—గోవిందసింహా! మహాబతు నిట రప్పించుము (అతను వచ్చును) సంకెళ్ళు విప్పుము-మహాబత్-జహూవ జయంబు ను కాలానుసరణంబులు, వాటికై వగవ బనిలేదు-నీ శౌర్యమునకు మెచ్చి నిన్ను విడిచితిమి ఆగ్రాకు పోయి మాన సింహునితో నామాటగా నిట్లనుము "ఈసమరమున మీ దర్శన మగునని యెంచితిని,-అట్లైనచో హల్దీఘాటీఅప్పు తీరి యుండును ఈ సారియైన యుద్ధమున దర్శన మిండవి ప్రార్థించుచున్నాను" నీవు సుఖివై యుండుము (అతను పోవును)

పృథ్వీ—ఉదయపురము రాణావారికి కైగతమయ్యెనా?

ప్రతా—అయ్యెను

పృథ్వీ—ఇక చిత్తూరే మిగిలి యున్నదా?

ప్రతా—చిత్తూరు మాత్రమే కాదు అజ్మీరు, మండలగడము నున్నవి (శక్తసింహుడు వచ్చును) తమ్ముడా! రమ్ము (ఆలింగనము) ఒక నిమిష మాలస్యమైనచో నిన్ను సజీవునిగా జూచి యుండను. ఇప్పటికి ధన్యులమే

శక్త—నన్ను గాంచితిరి కాని ఈయుద్ధమున నాసర్వస్వము పోయెను

ప్రతా—ఏమయ్యెను!

శక్త—నాభార్య దౌలతున్నిసా వీరస్వర్గము జేరినది.

ప్రతా—నీభార్య! బాలతన్నిసా? మొగలనాటిని పెండ్లియాడితివా?

శక్త—ఔను-పాదుషా మేనగోడలను పెళ్లియాడితిని ఎట్టిశక్తి!

ప్రతా—తమ్ముడా! తమ్ముడ! ఎంతపని జేసితివి? ఇన్ని దినాలనుండి నాసర్వస్వమును పణముగా నుంచి మనవంశగౌరవము నిలువబెట్టుచుంటిని-దాని నొకక్షణములో ధ్వంసము చేసితివా? హరిహరీ! సరే-నాబొందిలో ప్రాణముండగా నిట్టి దురాచారము మన కులమున జరుగకూడదని భగవతి సాక్షిగా ప్రమాణ మొనర్చితిని శక్తసింహా! నేటి నుండియు నీవు నాకు సోదరుడవు కావు, నీకూ నాకు నెట్టిసంబధమును లేదు మేవారురాజవంశము నిన్ను త్యజించుచున్నది-ఈ దుర్గము నీవు జయించితివి కావున నిదీ నీవును మేవారమునకు బహిష్కృతులు-ఇక పరస్పరసాహాయ్యము మనకు నిరపేక్షణీయము

పృథ్వీ—ఏమి రాణా! ఇట్లు సెలవిచ్చుచున్నారు?

ప్రతా—పృథ్వీ! శపథము నుల్లంఘింతునా? నా వంశమునుండి శక్తసింహుని బహిష్కరించితిని

పృథ్వీ—ఈ యుద్ధమున—శక్తసింహుడు—

ప్రతా—నాకు దక్షిణహస్త మయ్యెనని యెరుంగుదును, కాని వ్యాధిగ్రస్తమగు హస్తమును ఛేదించి శరీరారోగ్యమును కాపాడునట్లు శక్తసింహుని పోద్రోలి మా కుల

గౌరవము నిలువరించుచున్నాను

గో॥సిం—ప్రభూ! అతను శపథము చేయలేదు, అనుగ్రహింపుడు

ప్రతా—చాల్చాలు-గోవిందసింహా! ఏమి యుక్తి! వంశగౌరవమును నిల్పుటకే కదా రాజ్యమును ప్రాణములను విడుచుట కోలమానసగానక వనములగుర్మిమ్మ్మతితిమి అట్టియెడ సోదరుడు, పత్ని, సుతుడు మొదలగు పరివారమును త్యజించుటకు వెనుకదీయుదునా? నేను జీవించునంత కాలమైనా కుల గౌరవము కూలనీయను, పిమ్మట నేమైనా సరే శక్తా! ఇదే మనకు చరమసమావేశము, నేటితో మనకు బంధుత్వము పరిసమాప్తించెను (పోవును)

శక్త—అన్నా! నిన్ను దైవమువలె నారాధింతును కాని నీమాట విని దాలతును ధర్మపత్నీపదము నుండి తొలగింపను ఆమెను ధర్మసాక్షిగా స్వీకరించితిని, మావివాహమున మంగళవాద్యములు లేవు, పురోహితుని మంత్రములు లేవు, అగ్ని సాక్షికాదు అయిననేమి మాకు వివాహమయినది అట్లు భావించుటయు, ప్రకటించుటయు నాకు పరమసుఖదాయకము ప్రతాపా! నీవు నాకు దైవమవు, ఆమె నాకు దేవి నీవు పురుషుని మహత్త్వ మెరిగించితివి, ఆమె స్త్రీ మహత్త్వ మెరిగించెను పురుషుడు కేవల స్వార్థపరుడని నాకు దృఢవిశ్వాస ముండెను, నీ చరితము చూచుచుండిన కొలదీ త్యాగమున మహత్త్వమున్నదనియూ పురుషుడు

స్వార్థత్యాగప్రతిష్ఠాత కాగలడనియు గ్రహించితిని స్త్రీలు తుచ్ఛులు, అసారులు, కదర్యప్రవృత్తి కలవారని నాకు నమ్మకముండెను, కాని యీమె నారీసహజసౌందర్యము నాకు ప్రత్యక్షము కావించినది ఆహా! ఏమి సుందరా లోకము! ఏమి మహిమావేశము! విశ్వమోహనరూపము! ఏమి అద్భుతసృష్టి-మృత్యుసముద్రమున కద్దరినున్న స్వర్గజ్యోతిచ్ఛట లామెమోమున వెలిగెను చిరసంచితపుణ్యరాశియం దామె మున్గియుండ, తచ్చరణతలస్పర్శచే పృథ్వి ధన్యయయ్యెను,హత్యాగ్నిధూమమునుబోలినఆనిశ్వాసమున,మరణసన్నిహితమగు ఆ ప్రళయకల్లోలమున, జీవితావసానలగ్నమున- ఆహా! ఏమి దివ్యసుందర మూర్తి! ధన్యోస్మి! ధన్యోస్మి (వెళ్ళును)

---

## —నాల్గవ రంగము—

---

(ఉదయసాగరతీరమున మెహరున్నిసా)

మెహె.—ఈ పండువెన్నెల ఎంత మనోహరముగా కాయుచున్నది! ఈ నిశ్శబ్దనిశీథమున శుభ్రచంద్రాలోకమున- ఏమిది? చిత్త మాతనివంక బోవుచున్నది? ఇంతకాలము గతించినను మరపు రాకున్నాడు! తండ్రిగారి అగాధస్నేహము\ను నిరసించి, ఆగ్రాప్రాసాదముల భోగభాగ్యములను త్యజించిన న న్నిచటి కీడ్చుకొనివచ్చినవా డాతడే-ఇచ్చట

న్నా నాతని చూచుటకుగాని, ఆతని కంట బడుటకు
గాని వీలుండదని ఎంచి ప్రతిన జేసి నేటివరకూ నిల్పుకొన
జాలితిని. ఇచ్చోటు నేల విడువలేను? దినమున కొక
సారియైనా నా ప్రియు నామము వినబడుచుండుటనే కదా?
అంతమాత్రముననే సంతసించుచుంటిని ఇక సహింప
జాలను. నా హృదయోద్వేగ జలదమెల్ల ఇరాదేవిపై వర్షిం
చచూ తన్మూలమున నా ప్రలోభనము మహోవ్యాధియు నన్ను
బాధింపకుండ జేసుకొంటిని. అట్టి యవలంబనముకూడ అంత
రించె. ఇక నుండజాల. ఈ ప్రాణములు భరించుటెట్లు?
ఇచ్చోటు బాసిపోవుటయే శ్రేయము. నా వృత్తాంతము
దౌలతు చెవిని బడెనా ఆమె యెంత పరితపించునో? దౌలత్,
నిన్ను చూచి యెంతకాల మయ్యెనే! నీ వృత్తాంత మేమీ చెవిని
బడలేదు. రాణాప్రతినకు వెరచి శక్తసింహుడు నీ వృత్తాంతము
రహస్యముగా నుంచెను, నే నెవరితోడను చెప్పనైతిని,
ఎట్టులో జనరవము చెవిని బడినను రాణా దని నమ్మెదను
ప్రేమ సర్వస్వతంత్ర మైనను దాని రాజ్యమున నీ సాంఘిక
శాఖలు, విభాగములు, అడ్డంకులు నేకల్గెనో తెలియదు
ఈ నిషేధము లేల? ఈ హద్దు లేల? నే జేసినదంతయు
దౌలతు సుఖమునకే. ఆమె సుఖించును కదా అని యట్లు
చేసితిని. దౌలత్, నీవే అతనికి తగినదానవు.—నిన్నాతడు సుఖ
పెట్టిన నీ సుఖమే నా సుఖము. అదియే నా సాంత్వనము.
(పరిచారకుడు వచ్చును)

పరి—యువరాజ్ఞి- రాణావారు వచ్చిరి, అమ్మగారు నిన్ను పిల్చుచున్నారు ఆగ్రాయందిరి నీకేదయో లేఖ వచ్చె నట

మెహె—తండ్రిగారి యొద్దనుండియా? ఏదీ?

పరి—రాణావారియొద్ద నున్నది. యువరాజిటు వచ్చెనా?

మెహె—లేదు

పరి—ఎక్కడ నున్నాడో (వెళ్ళును)

మెహె—తండ్రీ! తండ్రీ! ఇన్నాళ్ళకు కూతురు జ్ఞప్తికి వచ్చినదా? పోయి చూచెదను (అమరుడు వచ్చును) అమరసింహా, పరిచారకుడు నిన్ను వెదకు చున్నాడు—ఇంటికి నడువుము.

అమ—మెహెర్- ఎటు పోదువు? ఇంచుక నిలువుము (చేయిపట్టుకొని) ఇద్దరము పోవచ్చును

మెహె—అగురా! ఏమీ నీయాగడము? చేయి వదలు-

అమ—అట్లే విడిచెదను, కాని ఒకమాట వినుము

మెహె—త్రాగియున్నావు- ఏమి, చెప్పదలచితివి?

అమ—మెహెర్-చూడుము ఈ ప్రాంగణమున చంద్రబింబచ్ఛవిని జూచితివా? ఎంత సుందరము! ఎంత కమనీయము! చూచితివా?

మెహె—ఆ- చూచితిని

అమ—ఈ చూ కాశము, ఈ పండు వెన్నెల, ఈ శీతల మందపవనము కనుచుంటివా? ఈ సౌందర్య మెవరికొరకు?

మెహె—నాకు తెలియదు - ఇంటికి పద

అమ—నేను చెప్పనా? భోగమునకు మెహెర్, భోగమునకు

మెహె—అడ్డు లే!

అమ—ఇట్టి సౌందర్యమును యువకులకై ప్రకృతి యమర్చెను కదా, వారు గాని ననుభవింపక విడువగూడునా!

మెహె—ఇంటికి పద

అమ—మెహెర్ - ఇక నిక్కము దాపనేరను, వినుము- నేను యువకుడను, నీవు యువతివి, ఇది యతినిభృత స్థానము- మధురమగు రాత్రి- సాంద్రచంద్రిక—

మెహె—అమరా! మదిరాపానమున మత్తెక్కి యున్నావు ఏమనుచుంటివో నీవే ఎఱుగవు పాపచింతమాని త్రోవ వీడుము

అమ—మెహెర్, మెహెర్, కరుణ—

మెహె—చేయి వీడుము

అమ—ప్రేయసీ (కౌగలింప బోవును)

మెహె—విడువవా? ఎవ రిక్కడ? (ప్రతాపుడు వచ్చును)

ప్రతా—భయము వలదు, మెహెర్ అమరా? ఏమది?

మెహె—మహారాణా! మదిరారసమున మత్తెక్కినాడు

ప్రతా—ఓరీ, ధర్మద్రోహీ! కల్లు త్రాగితివా! నిన్ను కడికండలు జేయవలయు

మెహె—మహారాణా! నామాటపైని వీని ననుగ్రహింపుడు. మొకటి తప్పు.

అగ—తండ్రీ, రక్షింపుడు (పాదములపైబడును)

ప్రతా—ఛీ, ఛీ, రాజపుత్రుడవయ్యు మరణము నకు వెఱచుచుంటివా? పాపీ, నేటినుండి నీవు నాకంట పడకు-పో-

అమ్మా రా పోదము

---

## — ఐదవ రంగము —

---

(గదిలో అక్బరు)

అక్బ—"ఇతరుల శాసింప నెంచువాడు ముందు తన్ను తాను శాసించుకొనవలయును" అని ఎలీమున కుపదేశించి ఉత్తరక్షణముననే క్రోధపరవశుడనై ప్రాణాధికయగు కన్యను పారద్రోలితిని అనంతరము కామవశుడనై గనపుత్రి రాజగణమునకు క్రోధము తెప్పించితిని బుద్ధిబలముచే వీటిని తిరిగి చక్కజేయగలనని మోచూచెదను మహాబత్ ఖానువల్ల మెహెరువార్త దెలిసెను. మెహెర్, ప్రాణాధిక కన్యా, నీవు మానాభిభూతవై జనకునాశ్రయము వీడి తచ్ఛత్రువు నాశ్రయిం

చితివి ఇది విన్న నెవ్వరైనా నవ్వరా? వినుపగూహాముననే స్వీకరింతును. నేను నీయెడ నొనర్చిన యపచారమునకు నన్ను క్షమింపుము తండ్రిని కానా? నాపై నీకు ప్రేమ లేదా? అని లేఖ వ్రాసితివి హా దైవమా, తండ్రుల నింత స్నేహదుర్బలుల జేసితి వేల? మెహెర్, శీఘ్రమే రమ్మా నీయపరాధమును నేను మన్నించితిని, నాయపచారమును నీవు సైరింపుము" అని చక్రవర్తినగు నేనొక బాలికను వేడుకొంటినే!

(దౌవారికుడు వచ్చును)

దౌవా—మహాప్రభూ, మేవాడుకు పోయినదూత వచ్చినాడు

అక్బ—ఒక్కడే వచ్చెనా? వార్తలేమి?

దౌవా—యువరాజ్ఞి మెహెరున్నిసాను తోడ్తెచ్చెను

అక్బ—శుభవార్తను వింటిని. మెహెర్ ఎక్కడ?

(మెహెర్ వచ్చును)

మెహె—తండ్రీ! తండ్రీ! అభివాదనము

అక్బ—అమ్మా మెహెర్, నీకు కుశలమా?

మెహె—తండ్రీ! తప్పు మన్నింపుము మూర్ఖోగ్రశిరోభూషకన్యను—బుద్ధిపూర్వకముగా దౌలతును సర్వనాశము చేసితిని, రాణానుసర్వనాశము చేసితిని, నేను సర్వనాశమైతిని, క్షమింపుము

అక్బ—నీ తప్పులన్నిటిని క్షమియించితినని నీకు వ్రాయలేదా? భారతవర్షమున దుర్జయుడగు పాదుషా నీయెడ

గడ్డిపోచవలె దుర్బలుడవు సుమా! నీవు నన్ను క్షమించితివా?

మెహె—తండ్రీ! క్షమించుటకు నీవు నాకేమి అపచార మొనర్చితివి?

అక్బ—నీమాతను నిందించితినే!

మెహె—అతప్పు నాకు క్షమింపవలయును నీదినేరమని ఒప్పుకొందువా?

అక్బ—అట్లు చేయకున్న నిన్నెట్లు రమ్మని వ్రాసితిని? అట్లు వ్రాయకుండు నీవు వచ్చియుందువా?

మెహె—తర్కించి వివేచనచేసి నేను రాలేదు నీయుత్తరమును జూచితిని, అక్కడ యుండలేక పోతిని, స్త్రీలకు విధి తర్కము కాక సహనము, మానమునియు, వారి జీవితము బయట కాక అంతఃపురమునందనియు, వారి కర్తవ్యము స్వేచ్ఛాచారము కాక సేవయనియు నే నెఱింగితిని

అక్బ—అమ్మా, రాణాప్రతాపసింహుడు నీయెడ నేమీ అత్యాచార మొనరింపలేదు కదా?

మెహె—తండ్రీ! తా నత్యాచార మొనర్పకపోవుటే కాదు, అత్యాచారాభిభూతనగు నన్ను రక్షణసేయుటకు పుత్రుని వీడి పత్నిని కోలుపోయెను ఒకనాడు రాణాపుత్రుడు మదిరామత్తుడై నాపై యత్యాచార మొనర్చుటకు సమకట్టగా ఆతని నప్పుడే యిలు వెడల గొట్టెను పుత్రవియోగార్తయై ప్రతాపసింహుని భార్య ప్రాణముల బాసెను

అక్బ—ప్రతాపసింహా! నీయందింత మహత్త్వమున్న

దని యెఱుగను నీ వుదారుడవు, మహాత్ముడవు నాకు మిత్త్రుడవైతే నాకు లొంగి కుడిపైపున నుండియుందువు, శత్త్రువువై నాతోడ సమమైన పదవి నందగల్గితివి నీతోడి శత్రుత్వము నా సామ్రాజ్యమునకు గౌరవము తెచ్చెను నేను సార్వభౌముడనై భారతవర్షమును శాసింపగల్గితినే కాని నన్ను నే శాసించుకొన నేరనైతిని నీవు దీనుడవయ్యు ఆశ్రితరక్షణార్థము క్షాత్త్రధర్మ మనుసరించి శరణువేడిన శత్త్రువు త్త్రిక శీలమునకు నీ పుత్త్రుని బలిజేసి భార్యను గోలుపోయితివి ఇంత మహాత్ముడవా?

మెహె—తండ్రీ, నా దొక మనవి ఆ పీఠమునకు విరుద్ధముగా నిక కత్తి నెత్తవలదు అతనికి వీరోత్తమోచిత సన్మాన మొసర్పుము నీకుశత్రువయ్యు నాతడు సహజవీరుడు మనుష్యమాత్రుడు కాడు, దేశస్వరూపుడు-అట్టివానియెడ వైరనిర్యాతనము నాతండ్రివగు నీకుచితము కాదు, నేడాతడు పీడితుడు, కుటుంబశోకావమగ్నుడు, అతని శోకమున కవధి కానరాదు,—కూతురు భార్యయూ మరణించిరి, భ్రాత పరిత్యక్తుడు, కుమారు డుచ్ఛృంఖలుడు—అందుచే నాతనిపై కృప వహింపుము

అక్బ—అమ్మా! ఇదివరకే నీ వినియుయార్థ మాతనికి చిత్తూరు సమర్పించితిని

మెహె—ఆతడు దానము పట్టడు, మరచితిని, మీకిమ్మని నాకొక లేఖ నిచ్చెను (ఇచ్చును)